## ఏమను కొంటున్నావ్! నేను ఓ పెద్ద పెయింటరునవుతా!!



**టింకూ లాంటి బాబు మీకు**
**వున్నప్పుడు**
**కావలసిందే మరి రీగల్**




ACIL/0367/82

## ఇండియాలో అత్యధిక శక్తిగల డిటర్జెంట్ బట్టలసబ్బు

ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు :
[1938—1972]
శుక్రవారం : 26-3-'82
దుందుభినామ సం. చైత్ర శు. పాడ్యమి
సంపుటము 75 : సంచిక 29
సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ
*
పోస్ట్‌లో ఏడాది చందా రు. 67—60
ఆరు మాసాల చందా రు. 33—80
విడిప్రతి వెల రు. 1—25 పైసలు
ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ-520 003

## విషయానుక్రమణిక

ముఖచిత్రం :
("టిక్-టిక్-టిక్"లో
కమల్‌హాసన్, మాధవి)

# ఉత్తరాలు

## కథలు

ఈ 26.2.82 నటి రతీదేవి ముఖ చిత్రముతో వెలువడిన సంచిక చదివాను. దానిలో రంగుల బొమ్మల కథ బాగుంది. నీకే తెలిసిన నీ మనసు కథ వెరైటీగా ఉంది.

సింహాద్రి కృష్ణప్రసాద్ (దివిసీమ)

*   *   *

26.2.82 ఆంధ్ర సచిత్ర వారపత్రిక ముఖ చిత్రం వెరైటీగా ఉంది. అనాథ కథ, నీకే తెలిసిన నీ మనసు కథలు నాకు బాగా నచ్చినవి.

టి. విశ్వనాథరెడ్డి (పెద్దకొట్టూరు)

*   *   *

26.2.82 తేది పత్రికలో నీకే తెలిసిన నీ మనసు కథ చాలబాగుంది. రచయితకు ధన్యవాదాలు.

పూసర్ల శ్రీనివాసరావు (వాల్తేరు)

*   *   *

26.2.82 నాటి ఆంధ్రసచిత్ర వార పత్రికలో 'అనాథ' కథ మమ్ములను కదిలించివేసింది. ఇందులో తల్లి పాత్ర వసుమతి పాటకులకు చెప్పలేని జుగుప్సాకరంగా ఉన్నది. అటువంటి తల్లులకు కనువిప్పు.

ఎం. వి. జగన్నాథరావు, ఎం సరోజ (చక్రధరపూరు)

26.2.82వ తేది వారపత్రికలో నీకేతెలిసిన నీ మనసు చదివాను. నాకు ఎంతగానో నచ్చింది. రచయితకు నా అభినందనలు.

కె. కమల (సత్తెనపల్లి)

*   *   *

26.2.82 నాటి పత్రికలో నీకే తెలిసిన నీ మనసు కథ చదివాను. బాగుంది.

పి. ఎం. ఎం. కె. మూర్తి (రాజమండ్రి)

## సీరియల్స్

26-2-82 రతీదేవి ముఖచిత్రం చూడ ముచ్చటగా ఉన్నది. మనసు కథ ప్రారంభంలోనే చాలాబాగుంది. తార సీరియల్ చాలా ఇంటరెస్టుగా ఉంది.

పి. సుబ్బులు, రమణ, గాయత్రి,వరలక్ష్మి (చావలి)

*   *   *

26.2.82వ తేదీన వెలువడిన అట్టమీద రతీదేవి చాల బాగున్నది. 'తార' సీరియల్ చదువు తున్నకొలదీ మనస్సు గాలిలో తేలినంత హాయి అని పిస్తున్నది. ముందు ముందు ఇంతకన్నా ఇంకా ఎంత బాగుంటుందో, 'మనసు కథ' మొదటిలోనే చాల ఆసక్తికరంగా ఉంది.

రాపేటి వీరభద్రరావు (ఖర్గపూర్)



26-?-82 నటి రతీదేవి ముఖచిత్రంతో వెలువడిన ఆంధ్ర సచిత్ర వారపత్రికలో వాసిరెడ్డి సీతాదేవిగారి మనసు కథ క్రొత్త సీరియల్ ప్రారంభం చదివినాం. చాల చాలా బాగుంది. రచయిత్రి చక్కటి పాత్రలను సృష్టించి కథన సరిక్రొత్త మలుపులతో.... సీరియల్ చదువుతున్నంతసేపు సుజాత పాత్ర మా కండ్ల ఎదుట మెదులుతూంది.

కావేటి భారతీలక్ష్మి, కావేటి లక్ష్మి వెంకటేశ్వరరావు (ఇల్లెందు)

*   *   *

26.2.82 ఆంధ్ర సచిత్ర వారపత్రిక ముఖచిత్రం నటి రతీదేవి ఎంతో ఆకర్షణీయంగా ఉంది. మనసు కథ ప్రారంభంలోనే ఎంతగానో ఆకర్షించింది.

వి.ప్రకాష్ (బాటసింగారం)

*   *   *

ఈ వారంతో ప్రారంభమైన మనసు కథ మొదట్లోనే అందరినీ ఆకర్షించింది. వచ్చే వారం ఏమవుతుందోనని ఉత్సుకతతో ఎదురు చూస్తున్నాము.

ఎస్. ఇందుముఖి (హైదరాబాదు)

*   *   *

26.2.82 రతీదేవి ముఖచిత్రం చూడముచ్చటగా ఉంది. 'తార' సీరియల్ చాల ఇంటరెస్టింగ్‌గా సాగిపోతోంది. కొత్త సీరియల్ మనసు కథ చాల బాగుంది.

ఎం. సుజాత (చిర్లవంచ)

*   *   *

26.2.82 సంచికలో ప్రారంభమైన వాసిరెడ్డి సీతాదేవిగారి 'మనసు కథ' సీరియల్ ఆరంభంలోనే మమ్మల్ని ఆకట్టుకుంది. తరువాత పత్రిక ఎప్పుడొస్తుందా? అని ఆత్రుతగా ఉంది.

పొమంచి సుబ్బలక్ష్మి (విజయనగరం)

*   *   *

26.2.82 నాటి ముఖచిత్రం నటి రతీదేవి ఎంతో ఆకర్షణీయంగా ఉంది. కొత్త సీరియల్ మనసు కథ రంగుల చిత్రాలతో కథ మొదట్లోనే మమ్మల్ని ఎంతో బాగా ఆకర్షించింది.

గోదావరి విజయలక్ష్మి,సూర్యనారాయణమూర్తి (కిరవరం)

*   *   *

26.2.82 నటి రతీదేవి ముఖచిత్రం చూడ ముచ్చటగా ఉన్నది. తార సీరియల్ చాల చక్కగా ఉన్నది. మనసు కథ ప్రారంభం చాల చక్కగా ఉన్నది.

కరుమోజు తిలోత్తమాదేవి (బారువా)

*   *   *

26.2.82 నాటి పత్రికలో మనసు కథ సీరియల్ మొదటిలోనే మమ్మలనుఆకర్షించింది. తార సీరియల్ చాలా ఇంటరెస్టింగ్‌గా ఉన్నది.

కువ్వారి మల్లెల విజయలక్ష్మి (అవుకు)

తే. 26.2.82 ది రతీదేవి ముఖచిత్రం స్వాగతం పలికినట్లు ఉంది. సీరియల్, "మనసు కథ" ప్రారంభం చాలా బాగుంది.

డబ్బీరు భానుమతి (అచ్యాపురం)

*　　*　　*

"రతీదేవి" ముఖచిత్రంతో వెలువడిన పత్రిక ఆకర్షణీయంగా ఉంది. 'తార' సీరియల్ వెరైటీగా ఉన్నది.

కళ్ళా నాగమణి (గింజలగూడెం)

*　　*　　*

తేది 26.2.82 పత్రిక ముఖచిత్రం సూపర్బ్. కొత్త సీరియల్ "మనసు కథ" మొదట్లోనే అందరినీ ఆకట్టుకొనేదిగా ఉంది.

మహమ్మద్ లతీఫుద్దీన్ (రాజమండ్రి)

*　　*　　*

గీత ముఖచిత్రంతో వెలువడిన ఆంధ్ర పత్రిక వారపత్రిక చాల అద్భుతముగా ఉన్నది, ముఖ్యముగా జీవితవనంలో కొత్తగాలి ముగింపు అద్భుతముగా చేశారు రచయిత్రి.

అల్లాబకష్ (మదనపల్లి)

*　　*　　*

'జీవితవనంలో కొత్తగాలి' సీరియల్ చదివాను. రచయిత్రి— కిరణ్ భార్య మరణం తర్వాత కథను అసహజంగా, అసమంజసంగా సాగదీసి చాల విసుగు కలిగించారు. కిరణ్, సంధ్యలు వివాహ విషయమై తమ అభిప్రాయాలను ఎందుకు వ్యక్తం చేసుకోరో అర్థంగాదు. రోడ్డుమీద ఆమె నడుం చుట్టూ చెయ్యి వేస్తాడు. హోటల్‌లో ఆమె తిన్న ఎంగిలి స్వీట్ తింటాడు. కానీ ఆమెను పెళ్లి చేసుకుంటానని చెప్పడు! ఇద్దరూ పార్కుల్లో గంటసేపు కూర్చుంటారు. కానీ మనసులో మాట బయటపెట్టరు! వారిది ఏం ప్రేమో?

ఇక ముందైనా మంచి నవలలను అందచేస్తారని ఆశిస్తున్నాను.

వి. రమేష్ (కాకినాడ)

*　　*　　*

"జీవితవనంలో కొత్తగాలి" నిజంగా చాలా చాలా బాగా వ్రాశారు. రచయిత్రి ఇందిరాదేవి గారికి ప్రత్యేక ధన్యవాదములు. "తార" సీరియల్ చాల ఇంటరెస్టింగ్‌గా ఉంది.

బి. ఎస్. ఆర్. మూర్తి (భువనేశ్వర్)

## మనవి

స్థలాభావం వల్ల ఈ వారం ఉమెన్ కార్టూన్ వెయ్యలేక పోతున్నాము.

—సం.

# లొసుగుల గొలుసు

యిందుర్తి సత్యనారాయణ రావు



"ఆయన భోజనం చేస్తున్నారు. వచ్చేస్తారు కూర్చోండి" అని చెప్పి లోపలి కెళ్లింది రంగనాథం భార్య.

టైము చూసుకొన్నాను, ఇంకో పది నిమిషాలే వుంది ఆఫీసుకెళ్లానికి. వీడెప్పుడూ ఆలస్యమే! పదింటిదాకా పూజా పునస్కారం అంటాడు. వీడి సైకిలు చెడినప్పుడల్లా వీడితోపాటు నేనూ ఆఫీసు కాలస్యమవడం, వాడితోపాటే ఆఫీసర్తో తిట్లు తినడం రివాజు.

పక్కనే బల్లమీది పుస్తకాలు చూశాను. 'సుజాత-ఫస్ట్ బీఏ' అనుంది.

("ఓహో! చివరికిది బిట్యాగ్గైతేనేం యింటర్ యీడ్చి బీఏ కొచ్చిందన్నమాట. మూడుసార్లు యింటరు తప్పితే— "యేదో సంబంధం చూసి ముడిపెట్టి దీన్ని పంపెయ్యరా" అంటుండేవాడ్ని రంగనాథంతో— "నెల మధ్యలోనే యెక్కడ అప్పు దొరుకుతుంది! అని చూసే వీడు పిల్ల పెళ్లి యేం చేస్తాడు" అనుకొంటూనే".

యధాలాపంగా ఆ పుస్తకం తీశాను. 'అర్థశాస్త్రం'టా! బొటన వేలితో యేదో పేజి తెరిచాను. అందులో గులాబిరంగు కాగితం. అనుకోకుండానే కాయితంలో యేవుందో చూశాను.

డియర్ సుజీ!

సాయంత్రం ఆరింటికి గాంధీ పార్కుకి రాగలవా! వస్తావో లేదో— నవోదయా బుక్ హౌస్ దగ్గర వుంటాను, కాలేజి కెళ్లేటప్పుడు చెప్పు— సీను.

అనుంది!

"రాస్కెల్! ఎవడీ సీను!" వళ్ళు మండింది నాకు. కారణం, రంగనాథం పిల్లల మీద రంగనాథాని కెంత బాధ్యతుందో నాకూ అంత బాధ్యతుందని నేను భావించడమే.

పుస్తకం బల్లమీద పడేసి ఆలోచనల్లో పడ్డాను.

ఇంతలో సుజాత వచ్చింది ఆ గదిలోకి! నేనేవీ మాట్లాడకముందే– 'హల్లో మావయ్యా! నాన్న సైకిలు మళ్లీ పాడైందా?'' అంది నవ్వుతూ.

'ఊఁ నాన్నని చాలా పాడవుతున్నై'' అన్నాను భారంగా.

'కాలేజీ టైమైంది, వస్తా'' అంటూ గబగబా బల్లమీది పుస్తకాలు తీసుకొని బైటికెళ్లిపోయింది.

ఆ తర్వాత రంగనాథం తతిమ్మా సంతానం వల్లురూ వచ్చి వారివారి రీతుల్లో నాకు వీడ్కోలు చెప్పి బడికెళ్ళిపోయారు.

''డామిట్... ఏవడీ సేను?'' పళ్ళు కొరుక్కున్నాను.

అప్పుడు తాపీగా కమీజు గుండీలు పెట్టుకొంటూ వచ్చాడు రంగనాధం– ''ఆలశ్యం చేసానేవిట్రా ?'! అని నవ్వుతూ.

''చేయకపోతే అడుగు'' అంటూ లేచాను.

రంగనాధం, నేనూ బైటికొచ్చాం. నేను సైకిల్ స్టాండు తీసి సీటు మీద కూర్చున్న తర్వాత, ఎగిరి కారేజి మీద కూర్చున్నాడు.

రంగనాథం నా కంటే ఏడాదో రెండేళ్ళో పెద్ద. కానీ యిరవై యేళ్ళకంటే ఎక్కువే పెద్దలా కనిపిస్తాడు. నేను నా వయసుకంటే పదేళ్ళు చిన్నగా కనిపిస్తే, వాడు వాడి వయసుకంటే పదేళ్ళు పెద్దగా కనిపిస్తాడు.

బుక్ హౌస్ దాటుతుండగా చూసాను. సుజాత ఎవడో సన్నగా, పొడుగ్గా వున్న కుర్రాడితో మాట్లాడుతోంది! షాపు రోడ్డుకి కొద్ది వారగా వుండటం వల్ల రంగనాధం వాళ్లిద్దర్నీ గమనించలేదు. నేనైనా పరిశీలనగా చూడకుంటే గుర్తించేవాడ్ని కాదు.

వాడు నా కంతకు ముందే తెల్సు. వాడు నాకు అక్కౌంటున్న బ్యాంకులో ప్యూను! అంతేగాక వాడ్ని చూసిన వెంటనే గుర్తొచ్చింది వీడూ, సుజాతా వారం రోజుల క్రితం సినిమాహాలు దగ్గర కనిపించారు. అప్పుడు రష్‌గా వుండటం వల్ల అతనడిగితే సుజాత టికెట్ కొనిచ్చిందేమో నమకోని ఆ విషయాని కప్పుడు అంత ప్రాముఖ్యత ఇవ్వలేదు నేను.

''అయితే వీ డే న న్న మా ట సేను... స్కౌండ్రల్'' అంత కోపంగా వున్నా ఓ విషయం తీవ్రంగా ఆలోచిస్తున్నాను– ''ఈ రంగతి రంగనాధానికి చెప్పాలా, వద్దా'' అని.

ఇంతలో రంగనాధమే మాట్లాడాడు–

''అరె ఓ పది రూపాయలుంటే యిస్తావ్రా...ఫస్టుకల్లా తిరిగిస్తా'' అంటూ!

వాడెంత విపత్తులో వున్నాడో వాడికి తెలీకపోవడం, పైగా అది నాకు తెలీడం వాడి పట సానుభూతి కల్గించింది నాకు. అందుకే యే వ్యాఖ్యానం లేకుండా సైకిలాపి, జేబులోంచి పది నోటు తీసి వాడికిచ్చాను.

''ఒక్క నిమిషం'' అంటూ రోడ్డుపక్కనున్న కిళ్ళీకొట్టుకెళ్ళి ఓ అయిదునిమిషాల్లో తిరిగొచ్చాడు వాడు అయిదు లాటరీ టిక్కెట్లతో.

నాకెక్కడ్లేని విసుగొచ్చింది. అయినా అదిమి పెట్టుకొని – ''చెల్లాయి సాయంత్రం కూరలు తెమ్మంటుంటే విన్నా...అందుకేమో ననుకొన్నా'' అన్నాను అదోరకంగా.

''ఔనౌను! నీ దగ్గరప్పు చేసిందందుకే'' అంటూ చిద్విలాసంగా నవ్వాడు వాడు.

''మరి లాటరీ టిక్కెట్లెందుకు తగలేసావు ?''

మరుక్షణం జేబులోంచో పది నోటు తీసి ప్రదర్శించి మళ్లీ జేబులో పెట్టుకొన్నాడు.

''అసలే పదుందిరా! నువ్వియ్యకపోతే దాటితో సరుకులు తీసికెళ్లేవాడ్నే! యివ్వబట్టి వీటితో సరుకులు తేసికెళ్తా. అరే! ఈ టిక్కెట్లు కొన్న పది మాత్రం అచ్చంగా నావేరో...'' ఆఖరి మాటలు తనకు తనే చెప్పుకొన్నట్టన్నాడు.

వాడికేసి విసుగ్గా చూసాను.

''ఔన్రా! అప్పు చేసిన బ్బులో లాటరీ టిక్కెట్లు కొంటే అదృష్టం తగల్తుంరా...'' అన్నాడు వాడు.

వాడ్ని చూస్తే జాలేసింది. ఇన్నేళ్ళ యిన్ని వందలు తగలేసి వాడు చేసిన డిస్కవరీకి. వాడికెప్పుడూ పదిరూపాయలకు మించి బహుమతి రాలేదీ జూదంలో!

నా ముఖంలో యేం చూసాడో వాడి ధోరణి మారిపోయింది. ''పదరా ... వేము తొక్కనా కాసేపు ... చాలా ఆలశ్యమైంది, ఆఫీసరేమంటాడో'' అన్నాడు.

నేనే సైకిలు తొక్కసాగాను. వాడు వెనక్కూర్చొని గొణగ సాగాడు–

''ఏంటోరా ... లాటరీలో ఓ బంపరు ప్రయిజు తగిలితే సుజాత పెళ్లి చేయొచ్చు – పిల్లల్ని మంచి చదువులు చదివించొచ్చు ... శాంతకి మంచి బట్ట కొనొచ్చు. అరే! నీకు తెల్సా ... శాంతకి యింతమటుకూ నేనెప్పుడూ ఒక్క ఖరీదైన చీర కొన్లేదురా'' అదో ధోరణిలో వున్న వాడ్ని ఆపడానికి –

''ఎన్ని వందలు తగలేసావురా ... వచ్చిందా ఒక్కసారన్నా బంపర్ ప్రయిజు ... పది రూపాయల్ని మించి ఎప్పుడైనా వచ్చిందట్రా ... ఎందుకురా! ఆ లాటరీ టిక్కెట్లు కొంటావు ? అదట్రా సంపాదనకు మార్గం'' ఆయాసంగా చివాట్లేసాను వాడ్ని.

''కరక్టేరా! కానీ నువ్వు నా పొజిషన్లో వుంటే నీ కర్థమై వుండేది! రెండు రూపాయలో ఓ లాటరీ టిక్కెట్టు కొంటే దాని



## లొసుగుల గొలుసు

ఫలితం తెల్సేవరకూ దాని ఆధారంతో వందలు విలువ చేసే కలలు కనొచ్చు ... మన కలలకి ఒక రీజనుందని తృప్తి పడొచ్చు..." అంటూ సైకిలు దిగాడు.

ఇద్దరం సీట్లు మారాం. సైకిలు నడవ సాగింది.

"ఎందుకురా యీ పూజలూ, పునస్కారాలు, లాటరీ టిక్కెట్లు కొనుక్కోడాలు, కలలు కనడాలు; మూడోవారం నించి అప్పు కోసం దేవుళ్లాడటాలూ— నా మాట విను... యిహనైనా కళ్లు తెర్చి అవసరాలు గ్రహించు — ఊఁ అను...నామోషీ యేముండదు, అసలు నువ్వెవ్వర్నీ అడగనేవద్దు. అంతా నేనే చూస్తా! నాకు లాగానే నువ్వూ హాయిగా వుండే అతి సులభమైన ఛాన్సు నీకుందిరా! ఎంతకాలం మడి కట్టుకూర్చుంటావు? యిదివరకులా కాదు...యిప్పుడు పిల్లల చదువులూ, సుజాత పెళ్లి...ఆలోచించు" అన్నాను.

దాంతో వాడికి కోపం వచ్చింది — "హవ్ మెనీ మోర్ టైమ్స్ డూ అయ్ హేవ్ టు టెల్యూ ఐ డోంట్ వాంట్ దట్ డామ్ బ్లడీ బ్రైబ్స్? లంచాలు తీసుకోలేకనేగా యిన్ని కష్టాలు పడటం ... యిన్ని రకాలుగా మభ్యపెట్టుకోడం... వద్దు ...నన్ను పిచ్చోడే అనుకో, దద్దమ్మే అనుకో... అది మాత్రం నాకిష్టంలేదు. నే చచ్చినా చేయన్నదే!" అన్నాడు వాడు ఖండితంగా.

"నీ ఒక్కడి వల్ల దేశం బాగుపడిపోతుందా ...నువ్వు నాశన మవడం తప్పితే! యీ తెలివి తక్కువతనం వదల్చు, యిడియెట్" అన్నాను.

వాడు నవ్వాడు- "యిప్పుడు వందలో ఒకడ్నే కావచ్చు... కానీ ఆ ఒకడైనా లేక పోవడం భవిష్యత్తుకెంత మాత్రం మంచిది కాదు" అన్నాడు రంగనాథం ఆఫీసు ముందు సైకిలాపుతూ.

అప్పుడు వాడు నా కంటే చాలా పున్నతుడుగా నా కనిపించాడు! ఆ మాటలనగల మనస్థైర్యం సంపాయించటానికి ఎన్నో అర్హతలు కావాలి. బతకడానికి సరిపోయే అర్హతలు ఆ మాటలంటానికి చాలవు మరి!

ఇద్దరం మౌనంగా ఆఫీసులోకి నడిచాం.

మా భయమేగానీ ఆఫీసరు రానే లేదింకా. సంతకాలు చేసి మా సీట్లోకి వెళ్ళాం.

> ### స్థానం
>
> ఆసానంలో పడి
> అణగారి పోయేవారు
> కొందరయితే—
> ఆస్థానాని కెగిరి
> అందల మెక్కేవారు
> కొందరు!
> ఎవరి జాతకం వారిదే!
> కాని, తగిన స్థానం లభించడం
> వ్యక్తికీ, దేశానికీ, అదృష్టం!
>
> — పైడిపాటి సుబ్బరామశాస్త్రి

ఇంతలో టైపిస్టు రంగమణి సైగ చేసి పిల్చింది లేచి ఆమె దగ్గర కెళ్ళాను ఏదో ఫైలందిస్తున్నట్లు నటిస్తూ మెల్లగా చెప్పింది—

"రాత్రి ఏడింటికి రండి... మాయిల్లు చాలా కన్వీనియెంటు" అని.

"ఓ కే! నూతన అద్దె గృహప్రవేశం చేసిన శుభ సందర్భంలో చక్కని బహుమతితో వస్తా" అని నవ్వి నా సీట్లోకి వచ్చాను.

దాంతో— రంగనాథం కష్టాల గురించిన నా ఆలోచన్లు అంతమైనై. రంగమణి మెత్తటి ఒళ్ళు, చక్కటి నవ్వులు తాలూకు వూహల్లో మునిగాను.

మధ్యాహ్నానికి వూహాలోకంలోంచిబైటపడి రంగమణికి రాత్రికి ప్రజెంటేషనుగా తీసుకోదల్చుకొన్న పట్టుచీర కోసం డబ్బులు సమకూర్చడానికి బాంకుకుబయల్దేరాను, ఆఫీసులో నో గంటన్నర పర్మిషనడిగి.

బాంకులో చెక్కు డ్రా చేస్తుండగా శ్రీను కనిపించాడు. అతన్ని చూడంగానే సుజాత విషయం జ్ఞాపకమొచ్చింది.

అతన్ని సైగచేసి, దగ్గరికి పిల్చి— "హాపుగంట నాతో బైటికి రాగలవా? నీతో కొంచెం మాట్లాడాలి" అన్నాను.

నాకేసో క్షణం ఆలోచనగా చూసి "మేనేజర్తో చెప్పొస్తా నుండండి" అని వెళ్ళి, ఓ అయిదు నిమిషాల్లో నా దగ్గరికొచ్చి "పదండి" అన్నాడు.

ఇద్దరం బాంకు లోంచి యివతల కొచ్చి, ఎదురుగా వున్న హోటల్లోకి దూరాం.

ఇప్పుడు...
అందానికి ఒక కేలమైన్

# పాండ్స్
## కేలమైన్ లోషన్

**పూసిన అందం,
సంరక్షించే గుణం,
తాజా మురిపెం,
మీ చర్మానికిది లాభమయం.**

చర్మానికి ఆరోగ్యంతోబాటే అది ఒక అందాల గని కావాలని కోరుకోరా మరి ? ఈ రెంటి కోసమూ యిదుగో కొత్త పాండ్స్ కేలమైన్ లోషన్ .

మచ్చలేని, నిర్మలమైన శోభ, చల్లదనం యిక మీ వంటిపైన—గాలిలోని, సంతోషం విరిసే, మారని ఆ తాజాదనం. మేకప్ వేసుకునే ముందైనా, లేదా దానంతట అదిగానే వాడటానికి వీలు. సుగంధం విరజిమ్మే, అందాన్నిచ్చే పాండ్స్ కేలమైన్ లోషన్.




పాండ్స్

లింటాస్-PIL. CL. 4-2316 Tb

## లొసుగుల గొలుసు

సర్వయర్‌కి రెండు కాఫీలు తెమ్మని చెప్పే వరకూ యిద్దరం మాటాడుకోలేదు

తర్వాత నేనే "నీ పేరు శీను గదూ ?" అని ప్రారంభించాను.

తలూపాడు.

"నే నెవరో తెల్సా ?" అడిగాను.

తలూపాడు.

"ఎలా తెల్సు ?"

"బాంకు కస్టమర్ కదా మీరు ... చాలా సార్లు చూసాను" అన్నాడు. తడబడుతూ.

"మరే విధంగా తెలీదా ?"

"తెల్సు."

"ఎలా ?"

"రంగనాథం గారి స్నేహితులు గదా మీరు !"

ముసుగులో గుద్దులాట మానేసాడు తను.

"ఔను ! అంతేగాదు, సుజాతకు మేనమామ లాటివాడ్ని" కొట్టినట్టు చెప్పాను.

చిన్నగా నవ్వుతూ తలూపాడు.

అతన్తో ఎలా మాట్లాడాలో అర్థం కాలేదు

"చూడు శీనూ ! సుజాతతో నీ చనువు నాకీరోజే తెల్సింది. అదంత మంచి పని కాదు."

"ఏది ?" నవ్వుతూ అడిగాడు.

ఆ క్షణం అతను నాకు నచ్చాడు. ఇలాటి సందర్భంలో కూడా నిట్నాటి తడబాటుగాని, నిర్లక్ష్యంగాని లేకుండా వున్న అతని ప్రవర్తన అతనంటే గౌరవాన్ని కల్గించక పోలేదు.

"నువ్వు బాంకులో ప్యూనువి ! సుజాత బీఏ చదువుతూంది, వాళ్ళ కుటుంబం ఎంత చితికివున్నా వాళ్ళెవరూ — సుజాత కూడా — నీ వివాహానికి నచ్చుకోరు. ఏదో సరదాకి కాలక్షేపం చేద్దామనుకోడానికి — రంగనాథం వంటివాడి కూతురే దొరికిందా నీకు ?" అడిగాను సీరియస్‌గా.

"సార్! సరదాగా తిరగాలని నేననుకోడం లేదు. ఆమెతో పరిచయం నేను సీరియస్‌గానే తీసుకొంటున్నాను. ఆమె పెళ్ళి చేసుకునేందుకు యిష్టపడకపోతే ఆమెకే చెప్పండి యీ జాగ్రత్తలు. ఆమె వద్దనుకొంటే ఆమె జోలికి నేను పోను..." అని నేనేమైనా మాట్లాడతానేమోనని ఆగాడు. నేనేం మాట్లాడలేదు.

తిరిగి తనే చెప్పసాగాడు మృదువుగా—
"సార్! నాకు చిన్నతనంలోనే తల్లీ, తండ్రీ పోయారు. వారి పంచనా వీరి పంచనా వుండి ఏదో తరగతి దాకా చదివి యీ ఉద్యోగం సంపాదించుకొన్నాను. ఒంటరితనమూ, ఆర్థికంగా నేను పడ్డ కష్టాలు యిప్పటికే నన్ను రాటు తేల్చాయి—" సర్వరు కాఫీ తెచ్చి బల్లలమీద పెట్టి, వెళ్ళిందాకా ఆగి కప్పు చేతిలోకి తీసుకొని మళ్ళీ మొదలెట్టాడు.

"-మీరు నమ్మతారో లేదో, నాకింత ఆత్మీయంగా వచ్చిన వ్యక్తి సుజాత ఒక్కతే. ఆమెంటే నాకు చాలా యిష్టం. ఆమె నన్ను పెళ్ళి చేసుకొంటే ఆమెను సుఖపెట్టడం కోసం ఏమైనా చేస్తాను. ఇంకా చదువుతాను, యింకా మంచి వుద్యోగం సంపాదిస్తాను. ఆలోచించండి సార్! భేషజాలు మర్చిపోయి చూస్తే రంగనాథం గారు కూడా నా కంటే మంచి అల్లుడ్ని తెచ్చుకోలేరేమో" తాగేసిన కప్పు కింద పెడుతూ అతన్ని సీరియస్‌గా చూట్టంతో క్షణం ఆగాడు. కానీ వెంటనే-

"కోపం తెచ్చుకోకండి... ఆ అమ్మాయి యేదో కాలక్షేపం కోసమే నాతో తిరిగుంటే మళ్ళీ ఎప్పుడూ ఆమె జోలికి పోను. ఆమెకు నా కంటే మంచి వరుడు దొరికితే, అందుకు సంతోషించే ప్రపంచంలో నేనే మొదటివాడ్నవుతాను కానీ ఆమె నన్నే యిష్టపడితే ఆమెను పెళ్ళి చేసుకొంటాను.

ఒక విధంగా చూస్తే... నా కంటే ఎక్కువ స్థాయిలో వున్న అమ్మాయిని పెళ్ళి చేసుకొంటే నేను బాగా కృషి చేసి యింకా మంచి పొజిషన్‌కు పోయే అవకాశం ఉంటుంది. దీన్ని ఇన్ఫీరియారిటీ కాంప్లెక్స్ అనండి-" అతన్ని మాట్లాడనీయకుండా చెయ్యి చూపి ఆపాను.

"రంగనాథం గారితో మాట్లాడి యే విషయం నీకు రేపు చెబ్తాను. నీ వాదన నే నర్థం చేసుకొన్నాలే-" అంటూ లేచాను.
అతనూ లేచాడు.

"ఇంతకూ సుజాతతో నీకెట్లా పరిచయమైంది?" అడిగాను.

"ఏవో కాలేజీ ఫీజులు కట్టడానికి రెండు మూడు సార్లు బాంకు కొచ్చింది. అయినా రోజూ యీ దోవనేగా కాలేజీ కెళ్ళేది" అన్నాడు.

అతన్తో తగూ నేనుప్పట్ను మాట్లాడ్డానికి, బెదిరించడానికి అవకాశమే లేకపోయింది. చాలా సంస్కారవంతుడే గాక, ఒక విధమైన ఆప్యాయతను కల్గించే రూపం అతనిది.

బిల్లు చెల్లించి బైటికొచ్చి, బాంకుదగ్గర విడిపోతుండగా చెప్పాను—"రేపు యే విషయం నీకు చెబ్తాను ... సాయంత్రం గాంధీపార్కుకి మాత్రం వెళ్ళకు!" అని.

అతను ఓ క్షణం నివ్వెరపోయి, తర్వాత నవ్వుతూ తలూపి బాంకులోకి వెళ్లాడు.

నేను ఆఫీసు కెళుతూ ఆలోచనల్లో పడ్డాను— నేను తల్చుకొంటే రంగనాథాన్ని యీ పెళ్ళి చేయడానికి ఒప్పించగలను. కానీ సుజాత లాంటి బంగారం వంటి పిల్లని చూస్తూ చూస్తూ ఓ అటెండరుద్యోగం చేసుకొనే వాడికివ్వడాన్ని నాకు నేనే నచ్చచెప్పుకో లేకుండా వున్నాను. రంగనాథానికి చేతగాకపోతే సుజాత పెళ్ళి కాకుండానైనా వుంటుంది గాని యింత అవమానకరమైన వివాహం చేసుకో నివ్వకూడదు. కనుక రేపు నేనే యేదో అబద్ధం చెప్పి శీనును యికమీద సుజాతతో కలవకుండా చూడాలి. ఆ నిశ్చయాని కొచ్చింతర్వాత యీ విషయం రంగనాథం దగ్గర యెత్తడం అనవసరమనిపించింది. నా అంతట నేనే యేదో విధంగా భయపెట్టి సుజాతని అదుపులో పెట్టగలను.

ఆఫీసులోకి అడుగు పెట్టిం తర్వాత రంగమణి దొంగ చూపులు చూస్తూ యీ విషయం నిశ్చింతగా మర్చిపోయాను.

* * *

ఆ రాత్రి టిప్‌టాప్‌గా తయారై, పట్టు చీర పాకెట్ చేతిలో పట్టుకొని రంగమణి యింటికి నడవసాగాను. ఆ సంతోష సమయంలో నన్ను నేను గొప్పగా వూహించుకొన్నందువల్లనేమో నా చుట్టూ వున్న వారిలోని బలహీనతలు పదేపదే జ్ఞాపకం రాసాగాయి.

"రంగనాథం పూజలూ, పునస్కారాలూ అంటాడు దద్దమ్మ. తరిపోయేంత సంపాదించలేక ఎవరో దేవుడు తనను కాపాడాలను కొంటాడు. పిల్ల పెళ్ళికి డబ్బులు కూడబెట్టలేక లాటరీ టిక్కెట్లు కొనే అసమర్థుడు... ఒక సరదా లేదు పాడూ లేదు.

ఇహ ఆ పిల్ల... సుజాత... దానికి ఏట్లాగూ తండ్రి పెళ్ళి చేయలేడని తెల్సు... వయసు సరదా అణుచుకోలేక ఎందుకూ కొరగాని వెధవ నొకడ్ని చూసుకొంది.

ఆ వెధవ... శీనుగాడు మాత్రం... చిన్నప్పట్నుంచి నా అనే వాళ్ళు లేని ఆ దరిద్రుడికి సుజాత లాటి పెద్దింటి పిల్ల కావాలి... దాన్ని ఇన్స్పిరేషనుగా తీసుకొని గొప్పవాడవుతాట్ట! స్కౌండ్రల్..." ఆలోచిస్తుండగానే రంగమణి యింటి దగ్గరగా వచ్చాను.



"రంగమణి మాత్రం...ఇదో ఇడియెట్... మొగుడు చస్తే కోర్కె లణచుకోలేదు... విధవ సాంప్రదాయాల్ని కాదని మరో పెళ్ళి చేసుకొనే ధైర్యం లేదు. మంచి పేరూ కావాలి, పబ్బం గడవాలి అందుకే రహస్యంగా అవసరం తీర్చుకోడమే గాక, యిట్లా అవీ యివీ ప్రజెంటేషన్లుగా కొట్టేస్తుంటుంది నావంటి వాళ్ళ దగ్గర–" ఆ చివరి ఆలోచన రాంగానే ఎవరో నా నెత్తిమీద మొట్టినట్లు ఆగిపోయాను.

"మరి మువ్వు?" అడిగింది నా మనసు.

"జాను మరి నేనూ!" అనుకొన్నాను దిమ్మెరపోయి. కొట్టిన మందునిషా దెబ్బకి దిగింది!

"మువ్వు... మువ్వూ అసలైన వెధవ్వి! రంగనాథం నీలా లంచాలు మెయ్యడు గనుక బీదవాడ్లా మిగిలాడు. వాడు అందువల్ల కలిగిన కష్టాలు మర్చిపోడానికి దేవుడూ, దయ్యం అని మభ్యపెట్టుకొని ఏవరో తనని కాపాడతారను కొంటాడు. లాటరీ టిక్కెట్లు

## లోహఃగుల గొలుసు

కొని ప్రయిజుకొట్టి పిల్ల పెళ్ళి చేయాలను కొంటాడు. ఆ పిల్లది మాత్రం తప్పేముంది? తండ్రి తన పెళ్ళి చేయలేడు గనుక ఆ వయసులో వరదాలని తనకు నీలైన విధంగా తీర్చు కొంటుంది అందుకా పిల్లనేమీ అనాల్సిన పని లేదు నీ లాటి వెధవలందరూ కలిసిచెడగొట్టిన సమాజానివాలి తప్పు. ఆ సీనుగాడు మాత్రం యే కాంప్లెక్సుతో నైనా అవనీ–ఆ పిల్లని పెళ్ళి చేసుకోవాలను కొన్నాడే తప్ప నీకు లాగా దొంగచాటు వేషాలేయాలనుకోలేదు. వాడు నీకన్నా వందరెట్లు నయం. రంగమణంటావా –ఆమేం చేస్తుంది? మొగుడు చచ్చాడుగాని కోర్కెలు చావలేదు...ఆమెని పెళ్ళి చేసుకొనే ధైర్యమున్న వెధవలు, ఆమెను తిట్టే సమాజంలో ఏందరేడిసారు? ఆమె అవసరాన్ని అదనుగా తీసుకొనే నీలాటి వాళ్ళు మాత్రం లక్షమందేడిసారు!

పెద్ద బోర విరుచుకొంటున్నావ్... నీ తండ్రి నీ కిచ్చిన ఆస్తుంది. యింతవాకా నానా గడ్డి తిని నువ్వు సంపాదించింది వచ్చేం తుంది. అయినా ఈ రోజున కూడా నువ్వు లంచాలు మేయడం ఏందుకు మానడంలేదు? నువ్వు రంగనాధాన్ననేవాడివా?

పెళ్ళాం, యిద్దరు పిల్లలూ వున్నారు... సిగ్గు లేకుండా యీ రంగమణులతో కాలక్షేపం చేసే కర్మేంటి నీకు? ఈ వయసులో గూడా వెధవ్వేషాలేసే నువ్వా రంగమణినీ, సుజాతనీ, శీనుగాడినీ తప్పు బట్టబోయేదీ–" యాదృచ్ఛికంగా మరో కోణం వించి నన్ను నేను చూసుకొన్నందువ నా మీద నాకే అసహ్యం వేసింది.

ఏవరో వట్టి తిప్పినట్టు వెనక్కి తిరిగి – వడవడాగాను వచ్చినదార్నే. ఈసారైనా నాకు సరైన దారి దొరికితే నా చేతిలోని చీర – సుజాత పెళ్ళి కానుక కావాలి! నాతో ఆఫీసులో పన్లు చేయించుకొనేవారు నవ్వుతూ రొల్లారి!!



పట్టువలె మృదువైనది
పగడంవలె అందమైనది
POND'S
VANISHING
CREAM
POND'S
పాండ్స్
వ్యానిషింగ్ క్రీమ్
నాజూకుగావుండే అనువైన మేకప్
ముఖ పౌడర్‌కి సంపూర్ణమైన ఆధారం
చర్మానికి ఉత్తమమైన రక్షణ
POND'S
HTM.PIL-2647

# ఫాలాక్షుని డైరీ



## చిత్ర లాభం!

సర్ రిచర్డ్ అటెన్‌బరో నానా కష్టనష్టాలకూ, వివాదాలకూ వోర్చి, తీసిన "గాంధీ" సినిమాకు అయిన ఖర్చులో ముప్పయ్యయిదుశాతం భారతదేశపు నేషనల్ ఫిలిం డెవలప్‌మెంట్ కార్పొరేషన్ ఖర్చు పెట్టిందట. ఇప్పుడు అదే నిష్పత్తిలో లాభం కూడా భారతదేశానికి చెందుతుందట. ఈ సినిమా పంపిణీదారులు కొలంబియా పిక్చర్స్ వారు సినిమా ప్రపంచ చరిత్రనే సృష్టిస్తుందని, కనకవర్షం కురిపిస్తుందని అంటారట. మనకూ లాభమేగా.

## సింహం గుహలో సరసాలు!

లక్నోలోని ఓ జంతు ప్రదర్శనశాలలోని ఓ సింహం గుహలోంచి నిట్టూర్పులు వినిపించసాగాయట. ఆ గుహలోని సింహాన్ని చూడవచ్చిన పెద్దవారేమి ఈ వింత అని ఆశ్చర్యపోయి, జూ అధికారుల కాశ్చర్యపరిస్తే వచ్చిచూసి నిర్ఘాంతపోయారట. ఆ గుహలో ఓ వేడి వేడి జంట ఒకరి బాహుబంధాలలో మరొకరు ఇరుక్కుపోయి ఆనందావస్థలలో ఉన్నారట. చూపరులా ఇద్దర్నీ బయటకులాగి చితకబాది ఎప్పుడూ ఇలాగ గుహల్లో, పులి బోనులలోనూ, సింహం గుహలలోనూ అవ్వాటలాడవద్దని హితవు చెప్పారట. కామం కళ్ళులేనిదంటే యిదే కాబోలు- అయితే గుహెలా తెలిసె?

## ఆనందంలో తలకిందులు!

రిపబ్లిక్ దినోత్సవాన్ని పురస్కరించుకుని హరియానా గవర్నరుగారు పోలీసు ఇలాకాలో జాతీయ పతాకాన్ని ఎగురవేశారట. ఆ పతాకం రివ్వున కర్ర చివరికంటా వెళ్ళి ఎరుపు రంగు క్రింద, పచ్చ రంగు పైన ఉండేలా ఎగిరిందట. జండా ఎగురవేసిన ఆనందంలో ఎవ్వరూ ఈ విషయం పట్టించుకోలేదుట!




## ఎంగిలాకుల నాయకుడు!

సేలంలో వివాహ మండపాలలో పెళ్ళయ్యాక, పెళ్ళి భోజనాలయ్యాక ఆ విస్తరాకులన్నీ తీసి బయట పడేశాక, ఆ ఎంగిలాకులు ఎవరుబడితే వారు తీసుకోరాదట. పెళ్ళి ఎంగిలి విస్తరాకులకు ఎగబడే బిచ్చగాళ్ళకు ఓ నాయకుడున్నాడు. ఆ విస్తళ్ళలోని ఎంగిళ్ళు ఎవరు తీసుకోవాలో ఏ పేటవారికి చెందుతుందో ఇతడు వచ్చి నిర్ణయిస్తాడట. అలాగా ఎవరైనా చేయి చేసుకొంటే రణరంగమైపోతుందట. తిన్నతర్వాత ఎంగిలి విస్తళ్ళలో కనీసం ఇంత పదార్థం ప్రతి ఒక్కరూ వదిలితీరాలనే తీర్మానంకూడ వచ్చినా రావచ్చు!

## ఆపరేషన్‌కి ఆరువేల పౌన్లు!

గుండెజబ్బుతో బాధపడుతున్న ఓ కుర్రాడికి వైద్యంచేసిన ఓ జర్మను డాక్టరా కుర్రాడు మహా బ్రతికితే ఓ ఏడాది పాటున్నారట. ఆ కుర్రాడికి లండన్ హాంప్‌స్టెడ్ ఆసుపత్రికి చెందిన డాక్టర్ స్టాన్లీ బాల్‌ఫర్‌లిన్ వైద్యంచేసి, అతని గుండెలోని బలహీనమైన కొన్ని వాల్వ్‌లను తీసిపారేసి, కొత్తవాల్వులను తయారుచేసి అతికించి 'నువ్విక రాయిలా చచ్చేవరకూ బ్రతుకుతావ్ పోవోయ్' అన్నారట. ఇది ప్రపంచ చరిత్రలోనే మొట్టమొదటిదట. ఈ ఆపరేషన్‌కి ఆరువేల పౌనులు ఖర్చు అయినదట.

## అంతర్జాతీయ బిచ్చగాళ్ళ మహాసభ!

జైపూర్‌లో అఖిల విశ్వ బిచ్చగాళ్ళ మహాసభ ఏర్పడ్డదట. "బెగ్గర్స్ ఫెడరేషన్" అనే యీ సంఘానికి కేరళకు చెందిన కెన్ను అనే ఓ భిక్షకశ్రేష్ఠుడు ప్రెసిడెంట్‌గా ఏకగ్రీవంగా ఎన్నికయ్యాడట. పవిత్ర భారత దేశంలోనే గాక, యావత్ ప్రపంచంలోనూ వున్న బిచ్చగాండ్రందరూ ఒకటిగా చేరి తమ హక్కులను నిరూపించుకొనే సమయం ఆసన్నమయినదని, కేవలం బిచ్చమెత్తి తమ కుటుంబాలను పోషించ కృతనిశ్చయులైన వారెవరైనా యీ సంఘ సభ్యులుగా చేరవచ్చుననీ, బిచ్చమెత్తుట కూడా ఒక వృత్తి వలె ప్రభుత్వం గుర్తించాలని యీ కెన్ను అన్నారట. విన్నారా?

## డబ్బివ్వలేదని భార్యని హత్యచేసిన తాగుబోతు!

తమిళనాడుకు చెందిన పూలాంపట్టి అనే వూరిలో 46 ఏళ్ళ పెరియణ్ణన్ అనే అతను సంపాదన లేని వాడు, తన భార్య కూలిపని చేసి తెచ్చిన డబ్బులలో కొన్ని లాక్కుని, తాగి తందనాలాడేవాడట. దాంతో అతని భార్య 40 ఏళ్ళ పెరుమాయికి కోపం వచ్చి ఓ రోజు డబ్బులివ్వను పొమ్మన్నదట. తాగుడు లేకపోతే ఆ రాత్రి గడవని పెరియణ్ణన్ డబ్బు కోసం ఆమెను చితకబాది, అప్పటికీ కుదరక ఆమెను కొడవలితో నరికి చంపి దాచుకున్న డబ్బులు తీసుకు నేరుగా సారాయి కొట్టుకు పోయాడట ●

## డాక్టర్ సలహాలు

**వై. టి. వి. — అత్తిలి**

నా ముఖము నిండా మొటిమలు వున్నవి. ఈ మొటిమలు ఎందుచేత వస్తాయి? ఇవి తగ్గిపోవాలంటే ఏ మందులు వాడాలి?

యుక్త వయస్కులలో స్వేద గ్రంధులు, చర్మంలో ఉన్న సెబేషియస్ గ్రంథులు ఎక్కువగా పని చేయుటం జరుగుతుంది. ఈ గ్రంథుల నాళములు అడ్డుపడినందు వల్ల గ్రంథులలో ఉత్పత్తి అయిన పదార్థం పేరుకు పోయి మొటిమలు లాగా అవటం జరుగుతుంది.

చర్మాన్ని పొడిగా శుభ్రంగా ఉంచుకోవటం చాలా అవసరం. ఈ మొటిమలను నొక్కటం గాని, గిల్లటం గాని చేయకూడదు. ఇలాచేయుటం వల్ల కంటి చూపుకి ప్రమాదం ఏర్పడ వచ్చును.

పై పూతగా వాడబడే మందుల వల్లఎక్కువ ఫలితం కనబడదు.

**వి. వి. కె. ఆర్. — భిలాయ్**

నా వయస్సు 20 సంవత్సరములు. 11సంవత్సరములుగా కాళ్ళ, చేతులమీద తెల్లటిమచ్చలు వున్నాయి. ఈమచ్చలు మరి కొన్ని చోట్ల వస్తున్నాయి. అన్నిరకాలవైద్యాలు చేసినా ఏమీ ప్రయోజనం కనిపించలేదు. ఈ మచ్చలు రావటానికి కారణమేమిటి? ఈ మచ్చలు వంశపారంపర్యంగా వస్తాయా?

విటిలైగో అనే మచ్చలు పుట్టుకతోనే ఏర్పడతాయి. కానీ అవిబహిర్గతమవటం ఏ వయసులోనైనా జరుగవచ్చును. కొందరికి ఈ మచ్చలు పెరుగుతూ రావటం జరుగుతుంది. మరికొందరికి ఈ మచ్చల ప్రమాణం మారదు. ఈ మచ్చలురాగల "తత్వం" వంశ పారం పర్యంగా వచ్చే అవకాశం ఉన్నది గాని, మచ్చలు వంశపారంపర్యంగా రావు.

**ఎమ్. ఎస్. బి — వీరవాసరం**

నా వయస్సు 22 సం.ల. కాని నాకు గెడ్డము మీసము రావటంలేదు. ఛాతీ మీద కూడా వెంట్రుకలు రావటంలేదు. రాకపోవటానికి కారణం ఏమిటి? రావటానికి ఏయే మందులు ఏ విధంగా వాడవలెను. తెలుప ప్రార్థన?

కొందరి శరీర తత్వాన్ననుసరించి ఇలాజరుగుతుంది. కొందరికి శరీరంలో ఆండ్రోజెన్ల ప్రమాణం తగ్గడం వల్ల వయస్సుకి తగినట్లు రోమములు పెరగక పోవచ్చును.

అందుకుగాను టెస్టోస్టిరాన్ వంటి మందుల వాడకం మీ వయస్సు దృష్ట్యా మంచిది కాదనే చెప్పాలి.

**బి.ఎస్. కె. — రాజమండ్రి**

నా వయస్సు 23 సంవత్సరములు. నాకు ఒక సంవత్సరం నుండి చాలా ఆకలిగా వుంటుంది. ఎంత ఆహారం తీసుకున్నా ఆకలిగానే వుంటుంది. తీపనిగాని, కారంఅనిగాని ఏమీలేదు. ఉదయం కాఫీ, టిఫెన్, మధ్యాహ్నం భోజనం, సాయంత్రం మధ్య మధ్య టిఫెన్, రాత్రి భోజనం తీసుకుంటాను. ఇవిగాక ఆకలి భరించలేక చిరుతిళ్ళు తీసుకుంటాను. అన్ని రకాల కూరలు తింటాను. ఈ అతి ఆకలికి ఏమి చెయ్యాలి? ఇదేమైనా వ్యాధా?

మీరు మూత్ర పరీక్ష, నెత్తురులో గ్లూకోజు పరీక్ష చేయించుకోవటం చాలా అవసరం.

ఈ పరీక్షల ఫలితాలలో డయాబెటిస్ ఉన్నదని తేలితే దానికిగాను వైద్యులవద్ద చికిత్స పొందవలసి ఉంటుంది.

## డాక్టరు సలహాలు

**పి.వి.కె. – కొండమూర్లంక**

కొందరి నాలుక చివర, నాలుక క్రింద నల్లగా ఉంటుంది. దీనికి కారణం ఏమిటి ? ఇదేమైనా వ్యాధా ? పోవాలంటే ఏ మందులు వాడాలి ?

పుట్టుకతోనే మెలనిన్ పిగ్మెంటేషన్ నాలుక మీద ఏర్పడటంవల్ల ఇలా జరుగవచ్చును. హుయుక్‌వర్మ్‌లు కడుపులో చేరటంవల్ల కూడా ఇలా నల్లటి మచ్చలేర్పడవచ్చును.

మల పరీక్ష రెండు మూడు సార్లు వరుసగా చేయించుకోవటం అవసరం. మల పరీక్షలో హుక్ వర్మ్ "హోవలు" కనపడితే ఆల్కోపార్ వంటి మందులు వైద్యుల పర్యవేక్షణలో తీసుకోవలసి ఉంటుంది.

**జి. బి. బి.వి. – బొంబాయి**

వారపత్రికలో మీరిచ్చిన, సలహాలో స్త్రీలకు గర్భ నిరోధకమాత్రలు గురించి వాడవలసిన బిళ్లల యొక్క పేరును వ్రాయలేదు. మాత్రలపేరు తెలుపప్రార్థన ఆ మాత్రలు ప్రతినెల వాడవలసి ఉంటుందా ?

ఆర్‌లెస్ట్, ఓవ్యులెన్, నోరాస్టైక్లిన్ మొదలైన మాత్రలు మందుల షాపులో దొరుకుతాయి. కుటుంబ నియంత్రణ పథకం క్రింద కూడా ఇటువంటి మాత్రలు దొరకటం జరుగుతుంది. చాలాకంపెనీలు ఈ మందులని తయారు చేస్తున్నాయి.

— డా. కె. వెంకటేశ్వరరావు

# కర్ణాటక
## రాష్ట్ర లాటరీ

గొప్ప
బహుమతి

**రూ 10 లక్షలు**

5 మొదటి బహుమతులు
**రూ.1,00,000**
రూ. 26,60,000 విలువగల
1,56,171 నగదు బహుమతులు



# యుగాది
# బంపర్
## డ్రా

ప్రతి టిక్కెట్టు రూ. 2

**10·4·82**

మైసూర్ సేల్స్ ఇంటర్నేషనల్ లిమిటెడ్.

KSL-216-TEL




(గత సంచిక తరువాయి)

## 6

అతనొచ్చి ఇంకా పదమూడు గంటలు కాలేదు. పదమూడు రోజులైనట్టుంది.

ఎంతో గంభీరంగా, హుందాగా మొదట కన్పించిన అతన్ని చూడగానే ఏమో అనుకుంది. మొదటి రెండు మూడు గంటలు వదిలేస్తే, ఇప్పటి వరకూ ఒకదాని తర్వాత మరొకటి భీతి గొల్పే సంఘటనలు వరసగా జరిగిపోతూనే ఉన్నాయి.

రాత్రి టెర్రస్‌మీద అతని ప్రవర్తన అనుమానాస్పదంగానే ఉంది.

పన్నెండు దాటినా గదిలో లైటువేసుకొని మేలుకొనే ఉన్నాడు.

తెల్లవారక ముందేవచ్చి ప్రసాదును లేపుకొని వెళ్ళాడు.

మరి ఆ నల్లపిల్లిచావో ?

ఇదెప్పుడు జరిగి ఉంటుంది ?

లేబరేటరీని ధ్వంసం చేయడానికి వెళ్ళేముందే దాన్ని చంపి ఉంటాడా ?

అసలు అతనే నల్లపిల్లిని చంపేసి ఉంటాడా ?

యాక్సిడెంటల్‌గా పిల్లి నీళ్లలోపడి చావలేదా?

కాదు —అది పడలేదు. అతనే చంపి ఉంటాడు.

అయితే ఎందుకు చంపినట్టూ ?

ఎందుకు ?

ఎందుకు ?

సుజాత పెనంమీద ఇంత నూనె పోసింది.

పెసరట్టు సుయ్‌మంటూ కాలుతోంది.

సుజాత మెదడు కూడా పెనంమీది అట్టులాగే కాగిపోతున్నది.

పిల్లిని ఎందుకు చంపినట్టూ ?

ఒకవేళ చంపినా నీటిలో ముంచి ఎందుకు చంపినట్టూ ?

అది ఇతని నేరమనస్తత్వాన్ని పసిగట్టిందా ?

పసిగట్టి అతడి వెనక వెనకే తిరగసాగిందా ?

కొన్ని జంతువులకు అలాంటి శక్తి ఉంటుందని తను విన్నది.

కాని అలాంటి శక్తి కుక్కలకు ఉంటుం దంటారు. పిల్లులకు కూడా ఉంటుందని తను వినలేదే !

లేక ఈ పిల్లి రాత్రి అల్లరిచేస్తూ అరుస్తుంటే ప్రసాదుగానీ, తనుగానీ లేస్తారేమోనని భయపడి దాన్ని అంతం చేశాడా ?

దాన్ని మెల్లగా బుజ్జగించి తీసుకెళ్ళి 'కుయ్‌ం కయ్‌' మనకుండా నీళ్లలో ముంచి చంపేశాడా ?

అదే అయి ఉంటుంది !

పిల్లిని నీళ్లలోపడేసి తొట్టిమీద మూతపెట్టి, అది లేవకుండా దానిమీద రాయి బరువుపెట్టి బయటికెళ్ళి ఉంటాడు. న్యూక్లియర్ లాబ్ నుంచి తిరిగొచ్చి ప్రసాదును లేపి స్విమ్మింగుకు తీసుకెళ్లి ఉంటాడు.

స్విమ్మింగ్‌పూల్ !

స్విమ్మింగ్‌పూల్ !

అక్కడికే ఎందుకు తీసుకెళ్ళాడూ ?

ఎందుకూ ?

ఇంకెందుకూ ?

అందుకే !

పిల్లిని ముంచినట్టు ఆయన్నుకూడా స్విమ్మింగ్ పూల్‌లో —

"ఓ మైగాడ్ ?"

పెనంమీద పెసరట్టు బుగ బుగ కాలి పోతున్నది. సుజాతకు ఒళ్ళు చెమట్లు కమ్ము తున్నాయి. అట్లకాడతో పెనం మీద మాడి అతుక్కుపోయిన అట్టును, గీకి గీకి బయటకు తీసింది. పెనం నల్లగా మాడి, కమురు వాసన కొడ్తూంది.

ఈ హంతకుణ్ని వదలకూడదు !

తన అదృష్టం బాగుండి ఆయన బతికి బయటపడ్డాడు.

ఆలస్యం చేస్తే ఈ రాత్రి అయినా ఆయన్ను హతమారుస్తాడు.

మనసులో చెలరేగుతున్న ఆలోచనలకంటే వేగంగా హాల్లోకి పరిగెత్తుకొచ్చింది. టెలిఫోన్ ఎత్తింది. చేతులు వణుకుతున్నాయి. టెలిఫోన్ డైరెక్టరీమీద చూపులు నంబరుకోసం గాబరాగా కదులుతున్నాయి.

'పోలీసు ఎమెర్జన్సీ !"

అంకెలు అతుక్కుపోయినట్టు కన్పించాయి. డయల్ తిప్పుతుంటే వేళ్ళు బిగిసిపోతున్నాయి.

"పొయ్యిమీద పెనం మాడిపోతుంటే మీరు ఇక్కడ ఫోన్ తిప్పుతున్నారేమిటి ?"

సుజాత ఎడంచేతిలో ఉన్న రిసీవర్ కింద పడింది. షాక్‌కొట్టినట్టు కుడిచెయ్యి డయల్ మీద నుంచి తీసింది.

వెనక శరత్‌బాబు నిలబడి ఉన్నాడు.

అతను పీల్చి వదులుతున్న గాలి ఆమె మెడ మీద వెచ్చగా తగులుతోంది.

"మా...మా...ఫ్రెండ్‌కు ... పొద్దున్నే చేయ మన్నది. ఇప్పుడు గుర్తొచ్చి..." నీళ్ళు నములు తున్నట్టుగా అన్నది సుజాత.

"గ్యాస్"

సుజాత అదిరిపడింది ! అతనికేసి తలెత్తి చూసింది.

"గ్యాస్ స్టౌవ్ ఆఫ్ చెయ్యడం కూడా మర్చి పోయారా ?" నవ్వుతూ అన్నాడు అతను.

ఆమె నిట్టూర్పు విడిచింది.

"అవునవును !" కీలుబొమ్మలా తలాడించింది. వంటగదికేసి ఒక అడుగు ముందుకు వేసింది.

"మీ ఆయన ఆపని చేస్తున్నాడులే ! మీరు ఫ్రెండుకు ఫోన్ చేసుకోండి" తాపీగా అన్నాడు శరత్‌బాబు.

కీళ్లు ఊడదీసిన బొమ్మలా ఫోన్ పక్కనే ఉన్న కుర్చీలో కూలబడింది సుజాత.

రిసీవర్ ఎత్తి నాలుగు నంబర్లు తిప్పి, ఐదో నంబరు తిప్పుతూ ఉంటే "మీరు నంబరు మర్చి పోయినట్టున్నారు" వెనకనుంచి అన్నాడు శరత్‌బాబు.

సుజాత హఠాత్తుగా పులిబోనులోపడ్డ లేడిలా శరత్‌బాబుకేసి చూసింది.

"మీరిందాక తిప్పుతున్న నంబరు అదికాదు."

"మా ఫ్రెండ్ నెంబరు ... నెంబరూ ... "

"మారిపోయింది !"

"అవును ! మారిపోయింది."

"అయితే మీరింతవరకూ ముందు చేసింది రాంగ్ నంబరు అన్నమాట !" మెల్లగా మెత్తగా నవ్వాడు.

అది ఆమె వంటికి చల్లగా తగిలినట్టు అన్పించింది.

పులి చంపిన లేడి తన కళ్ళ ముందు ఎగిరెగిరి పడింది !

ఆమె కళ్లల్లో రక్తం పొంగింది.

**జరిగిన కథ — 4 :** ఢిల్లీ కాన్ఫరెన్స్‌కని వెళ్లిన శివప్రసాద్ అక్కడికి వెళ్లకుండానే తన ఫ్రెండ్ శరత్‌బాబుతో తిరిగొచ్చిన భర్తను చూసి ఆశ్చర్యపోతుంది సుజాత. తను కాన్ఫరెన్సుకు వెళ్లి తిరిగొచ్చేవరకు శరత్ ఇక్కడే వుంటాడని చెప్తే ఏం చెప్పాలో తోచక ఆలోచన్లో పడిపో తుంది. ప్రసాద్ ఢిల్లీ వెళ్లకపోవడానికి గల కారణమేమిటో చెప్పకపోవడంతో, ఏమేమో వూహించుకొంటుంటుంది సుజాత. నిద్రపట్టక వెర్రి ఆలోచనలను చేస్తున్న సుజాతతో కాంపోజ్ టాబ్లెట్ మింగించి నిద్రపుచ్చుతాడు శరత్. ఇంట్లో జరిగిన కొన్ని సంఘటనవల్ల న్యూక్లియర్ ఫ్యూయల్ కాంప్లెక్స్‌ను కూడా శరత్‌బాబే పేల్చివేశాడన్న అనుమానంతో అతన్ని పోలీసులకి పట్టివ్వాలని నిర్ణయించుకొంటుంది సుజాత.

ఆమె అతని ముందు నుంచి ఎలా నడిచి వెళ్ళ గలిగిందో ఆమెకే తెలియదు.

వంటగదిలోకి వచ్చింది.

సింక్‌లో నీళ్ల పంపు విప్పింది.

జర్రున నీళ్లు చిమ్ముతున్నాయి.

దోసిళ్లతో నీళ్లుపట్టి మొహంమీద చల్లుకుంది. చల్లటినీళ్లు ముఖంమీది నుంచి జారిపోతుంటే, లేడిని ఆరగించి హాయిగా గుహలో నిద్రపోతున్న పులి కళ్లముందు మెదిలింది.

"మీరుండండి!" అంటూ భర్త చేతిలోని అట్లకాడ తీసుకుంది.

"సుజాతా! ఏమిటి ఇవ్వాళ ఇలా చేస్తున్నావు?"

"మీరీ ఉదయం ఢిల్లీకి ఎందుకు పోలేదో ఇప్పుడు నాకు అర్థం అయింది. మీరిద్దరూ కలిసే ఈపని చేస్తున్నారు."

"ఏ పని?" చిరాగ్గా అడిగాడు ప్రసాదు.

"మీరిద్దరూ కలిసే లేబ్‌కు నిప్పు పెట్టారు! దాన్ని పేల్చి వేశారు"

"ఏమిటే నీ వాగుడు?" భర్త కంఠం కర్కశంగా వినిపించింది.

"పిల్లని చంపారు!"

"నోరుముయ్! ఇడియట్!" ప్రసాద్ చరచరా వంటింట్లోనుంచి వెళ్ళిపోయాడు.

"నేను ఇడియట్‌నే! లేకపోతే నేను ఈ ఇంట్లో ఉండగానే ఇద్దరూ కలిసి ఇన్ని ఘోరాలు ఎలా చెయ్యగలుగుతారు? నాకు నిజంగానే బుద్ధిలేదు, మందబుద్ధిని! మా నాన్న అంతకంటే ఇడియట్! లేకపోతే ముక్కూ — మొహం తెలియని నీ కిచ్చి నా పెళ్లి చేస్తాడా? ఆ ముసలాడు నా గొంతు కోశాడు. బరువు దించేసుకున్నందుకు సంతోషించాడు. కాని కన్నబిడ్డను ఏ గోతిలోకి నెట్టాడో తెలుసుకోలేదు." సుజాత మనసులోనే అనుకుంది.



ఆమెకు తల బద్దలైపోతున్నట్టుగా ఉంది.

"నర్సమ్మా! రెండు ప్లేట్లు తుడిచి ఇక్కడ తగలెయ్యవే!" కిటికీలోనుంచి దొడ్లోకి చూస్తూ అన్నది.

పంపుదగ్గర బట్టలు ఉతుకుతున్న నర్సమ్మ ఆ పని ఆపి, చేతులు కడుక్కొని లోపలకు వచ్చింది.

సుజాత మూడేసి పెసరట్లు, రెండు ప్లేట్లలో పెట్టి నర్సమ్మ చేతికి అందించింది.

"తీసుకెళ్ళు! అయ్యగారికివ్విరా!"

నర్సమ్మ సందేహిస్తూ ఆమె ముఖంలోకి చూసింది.

"సరే! అక్కడ తగలెయ్! నువ్వెళ్లి నీ పని చూసుకో!"

"మాయదారి పిల్లి ఎట్టా వచ్చిందో! పొద్దుట్నుంచి అమ్మగారు అదోలా ఉన్నారు" అనుకుంటూ వంటింట్లోనుంచి వెళ్ళిపోయింది నర్సమ్మ.

సుజాత రెండు ప్లేట్లూ తీసుకెళ్ళి డైనింగ్ టేబుల్‌మీద పెట్టింది. చట్నీ గిన్నెలో స్పూన్ వేసి టేబుల్‌మీద వుంచింది. రెండు గ్లాసులూ, నీళ్ల జారూ కూడాపెట్టి సుజాత గెస్టురూంకేసి తొంగి చూసింది.

"ప్రసాద్ నువ్వలా మాట్లాడవలసింది కాదు ఓపిక పట్టాలి."

రాస్కెల్! మారిపోతున్నాడు. ఆయన్ని బుట్టలో వేసుకున్నాడు. తనను కూడా మాయ చెయ్యాలని చూస్తున్నాడు.

సుజాత రుసరుసలాడిపోతున్నది.

"అక్కడే నిలబడిపోయారేం?"

శరత్‌బాబు గొంతు విని సుజాత తుళ్లిపడింది.

ఈ మనిషిని పాము చెవులు!

గద్ద చూపులు!

"టిఫిన్ పెట్టాను" గొంతు పెగల్చుకుంటూ అన్నది.

స్నేహితులిద్దరూ లేచి డైనింగ్ టేబుల్ దగ్గరకు వచ్చారు.

## 7

మధ్యాహ్నం భోజనాలు అయినై.

డైనింగ్ టేబుల్ తుడిచి, చేతులు కడుక్కొని బెడ్‌రూంలోకి వెళ్ళింది సుజాత. పక్కమీద అలసటగా వాలిపోయింది. ఒళ్ళంతా విరగొట్టేసినట్టుంది. తలలో ఏదో నాదుగా ఉంది. కళ్ళు మూసుకొని నిద్రపోవడానికి ప్రయత్నించింది. నిద్రరావడంలేదు. పక్కమీద బోర్లాపడుకుని దిండులో తల దూర్చింది.

తలలో వీడియో టేప్ తిరిగిపోతున్నది.

అతను ఈ ఇంట్లో కాలుపెట్టిన దగ్గరనుంచి జరిగిన సంఘటనలు ఒక్కొక్కటే కళ్ళకు కన్పిస్తున్నాయి. కళ్ళు మూసుకుంది. అయినా ఆ దృశ్యాలు కన్పిస్తూనే ఉన్నాయి.

భోజనాల దగ్గిర వాళ్ళిద్దరూ మామూలుగానే మాట్లాడుకున్నారు. వాళ్ల ప్రవర్తనలో ఎలాంటి మార్పూలేదు.

గుండెలు తీసిన బంటులు! ఇద్దరూ ఇద్దరే!



వీళ్ళ స్నేహం ఈనాటిది కాదు!

కలిసే నేరాలు చేస్తున్నారు!

వీళ్ళను విడదీయరాని బంధం అదే! అదే!

చూస్తేనేమో మహామేధావులు!

జీనియస్‌లు!

న్యూక్లియర్ సైన్సులో ఒకడు డాక్టరు. ప్రొఫెసరు. మరొకడు జన్యుశాస్త్రంలో తిరుగులేని మేధావి. సశాస్త్రీయమైన వీళ్ల మేధస్సుల వెనక ఈ నేర ప్రవృత్తి ఏమిటి? వీళ్ళిలా నేరాలు చేస్తూ ఎంతకాలం తప్పుకు తిరుగుతారు? ఎప్పుడో ఒకప్పుడు వీళ్ల పాపం పండదా? అవును! ఒకరోజు పాపం కుండ బద్దలౌతుంది.

శరత్‌బాబు – శివప్రసాద్ పేర్లు పత్రికల్లో వస్తాయి. ఫోటోలువేసి నేరస్తులుగా ప్రజల ముందు నిల్చో బెట్టబడతారు.

అవును! ఆ రోజు ఎంతో దూరం లేదు.

అది ఇవ్వాళే కావచ్చు.

లేక రేపు కావచ్చు!

తను ఇక్కడ్నుంచి వెంటనే బయటపడాలి. కాని ఎలా? రాత్రిపూట తనకు కాపలా కాస్తారు. అంతగా అవసరం అనుకుంటే మత్తు బిళ్లలు

మింగిస్తారు. తను ఫోన్ చెయ్యడంకూడా గమనిస్తున్నాడు శరత్‌బాబు. తను తిప్పే నంబరు కూడా నోటీస్ చేస్తున్నాడు.

క్రిమినల్ మైండ్! అది ఎన్నోరకాల జాగ్రత్తలు తీసుకుంటుంది. నేరం బయటపడకుండా అతి జాగ్రత్తగా ఉంటుంది. అన్ని మార్గాలనూ మూసి వేస్తుంది. ఎక్కడివాళ్ళను అక్కడే బంధించి వేయడానికి ప్రయత్నిస్తుంది. క్రిమినల్ మైండ్! ఈ క్రిమినల్ మైండ్‌నుంచి తను తప్పించుకోవాలి!

ఎలాగయినా బయట పడాలి. పగలే...కాదు... నౌ ఇట్ సెల్ఫ్—ఇప్పుడే...వెంటనే బయట పడాలి. శరత్‌బాబు కంటపడకుండా బయటపడాలి.

శివప్రసాద్ — అదే తన భర్త... తన భర్త అనుకుంటేనే కడుపులో దేవినట్టు అవుతున్నది.

ధర్మరాజు లాంటివాడు యమధర్మరాజులా అయ్యాడు.

ఈ శరత్‌బాబు శకునిలా పట్టాడు. ఇతడు వచ్చినప్పట్నుంచే ఆయన ఇలా ప్రవర్తిస్తున్నాడు. ఈ కుట్రలో ప్రసాదు పాత్ర పెద్దగా లేదేమో? శరత్‌బాబు అధీనమైపోయి ఇలా ప్రవర్తిస్తున్నాడేమో?

అసలు ఈయన అతనికి ఎందుకు లొంగిపోయినట్టు? ఏదో బలమైన కారణమే ఉండి ఉండాలి.

తను బయట పడటానికి ఇదే సమయం.

ప్రసాద్ స్టడీరూంలో కూర్చుని ఏదో చదువుకుంటున్నాడు.

ఇంతకంటే మంచి అవకాశం మళ్ళీ తనకు దొరకదు.

శరత్‌బాబు పడుకొని కునుకు తీస్తున్నాడు. రాత్రంతా నిద్రలేదు కదా మరి? ఇదే మంచి అవకాశం — తను బయటపడడానికి.

సుజాత బాణంలా పక్కమీద నుంచి లేచింది. బాత్‌రూంలోకి వెళ్ళింది. ముఖం కడుక్కొని డ్రెస్ చేసుకుంది. అంతా అయిదు నిముషాల్లో అయిపోయింది. మామూలుగా అయితే అరగంటయినా పట్టేది.

డ్రెసింగ్ టేబుల్‌మీద ఉన్న బేగ్ అందుకుంటూ ఉండగా, నిలువుటద్దంలో భర్త కన్పించాడు. ఆమె వళ్ళు ఒక్కసారిగా మంచుగడ్డలా అయిపోయింది!

చేతి బేగ్ కిందకు జారింది.

కీలుబొమ్మలా గిర్రున తిరిగి భర్తను చూసింది.

"ఈ వేళప్పుడు ఎక్కడికి సుజా తయారైనావు?" భర్త ఆశ్చర్యంగా అడిగాడు.

"ఫ్రెండింటికి?"

ప్రసాద్ భార్యను ఎగాదిగా చూశాడు.

"నా ఫ్రెండింటికి!"

"నీ ఫ్రెండింటికి కాక నా ఫ్రెండ్ ఇంటికి వెళ్తావా ఏం? ఏ ఫ్రెండ్ ఇంటికని అడుగుతున్నాను."

"అదే ... మనకారోజు ... సూపర్‌బజార్లో కన్పించి పలకరించింది ... సునీత ... వాళ్ళింటికేనండీ!"

"ఇదింకా బాగుంది."

## మనసు కథ

"సునీత వాళ్ళమేటండి! నాకు చాలా క్లోజ్!"

"అదేనోయ్ నేనూ అనేది!"

సుజాత గుండెల్లో దప్పుళ్ళు తగ్గాయి.

గుండెనిండుగా గాలి పీల్చుకుంది.

"సునీత ఇప్పుడే ఫోన్ చేసింది. నువ్వు బాత్‌రూంలో ఉన్నావు."

సుజాతకు పై ప్రాణం పైకి ఎగిసిపోయినట్టయింది.

"ఏం చెప్పిందది నన్ను రావద్దని చెప్పిందా? ఆ! అది తను బయటికి వెళ్తున్నాననీ, నన్ను రావద్దనీ చెప్పిందా?"

ఇదీ కుట్రే!

మరో మోసం!

తనను బయట కెళ్ళనీయకుండా ఆపేందుకే ఈ నాటకం ఆడుతున్నారు. ఆ శరత్‌బాబే ఈయన చేత యీ నాటకం ఆడిస్తున్నాడు.

"నువ్వు ఆలోచిస్తున్నదంతా పొరపాటు. నువ్వు అనుకుంటున్నది రాంగ్!" అన్నట్టుగా భార్య ముఖంలోకి చూశాడు ప్రసాద్.

సుజాత కళ్ళముందు మసక తెరలు పడుతున్నాయి.

"సునీతా, ఆమె భర్తా నాలుగూ—నాలుగున్నర మధ్య మనింటికే వస్తారట. నువ్వు ఇంటదగ్గర ఉన్నావో లేవో తెలుసుకోవడానికి ఆమె ఫోన్ చేసింది. బాత్‌రూంలో ఉన్నావన్నాను. ఈ కబురు నీకు చెప్పమన్నది. ఎటూ తయారయ్యే ఉన్నావు కనక హడావిడేంలేదు. నీ ఫ్రెండును రిసీవ్ చేసుకోవచ్చు. అంతవరకూ మా దగ్గిరకొచ్చి కూర్చో! శరత్ చాలా ఇంటరెస్టింగ్ కబుర్లు చెబుతున్నాడు. రా! ఏమిటాలోచిస్తున్నావ్?"

శివప్రసాద్ ఆప్యాయంగా మాట్లాడుతున్నాడు. అంతకుముందు తనను చూసి, మాటలు ఆపేసి ఇద్దరూ లేచిపోయి కూర్చునేవాళ్ళు — ఇప్పుడు తమతో కూర్చోమని ఆహ్వానిస్తున్నాడు. ఆదరణా, ఆప్యాయతా వలకపోస్తున్నాడు.

ఎందుకో తను ఊహించగలదు!

తనను వీళ్ళు తెలివితక్కువ దద్దమ్మ అనుకుంటున్నారు.

తను ఎక్కడ పారిపోతుందోనని వాళ్ళ భయం.

"వాళ్ళొచ్చేలోపల మీరు కూడా బట్టలు మార్చుకొని రావచ్చుగా?" భర్త ముఖంలో దేన్నో వెతికి పట్టుకోవడానికి ప్రయత్నించింది.

"ఏం ఈ బట్టలు బాగాలేవా?"

"ఆ లుంగీ మాసిపోయి ఉంది. పొద్దుట షేవ్‌కూడా చేసుకున్నట్టులేదు. నీటుగా తయారవండి?" దీర్ఘం తీసి, కళ్ళు ఆలవోకగా తిప్పుతూ అన్నది.

"మీ ఫ్రెండు వస్తున్నది నన్ను చూడటానికా నిన్ను చూడటానికా?"

"నిజంగానే వస్తున్నారా?" పెదవులదాకా వచ్చిన మాటల్ని మింగేసింది.

"ఇల్లాలిని చూసి ఇల్లు చూడమన్నారు. కాని భర్తను చూసి ఇల్లాలిని చూడమనలేదే?" ప్రసాదు నవ్వుతూ అన్నాడు.

"అవునా! మాసిన బట్టలూ, పెరిగిన గడ్డం, చూసేవాళ్ళకే నీరసం వచ్చేలా ఉన్నావ్. మీ ఆవిడ చెప్పింది కరెక్టే!"

ఆరే ఇతనెప్పుడొచ్చాడు?

వాకిట్లో తలుపు పక్కగా నిలబడిన శరత్‌ను చూస్తూ అనుకుంది సుజాత.

అతడి కళ్ళన్నీ తనమీదే ఉన్నాయి.

నీడలా వెంటాడుతున్నాడు.

ఒకవేళ తన భర్త తనను బయటికి వెళ్ళనిస్తాడేమోనని భయం కావచ్చు! వంద కళ్ళతో, వెయ్యి చూపులతో కాపలా కాస్తున్నాడు. దీని అర్థం ఏమిటి? "నువ్వు డ్రెస్ మార్చుకో — అంతవరకూ ఈమెను నేను గమనిస్తూ ఉంటాలే!" అన్నట్టు కళ్ళతోనే తన భర్తకు చెబుతున్నాడు. ఆ మాత్రం తను గ్రహించలేదా?

"ఓ.కే. సుజా! స్నానం చేసి బట్టలు మార్చుకొస్తాను" అంటూ శివప్రసాద్ బాత్‌రూంలోకి వెళ్ళాడు.

శరత్‌బాబు వెళ్ళి హాల్లో సోఫాలో కూర్చున్నాడు.

అతడ్ని వెనకనుంచి పరిశీలనగా చూస్తూ ఆమె కూడా హాల్లోకి వచ్చింది. కిటికీ కర్టెన్ తొలగించింది. బయట గేటుకేసి చూస్తూ నిలబడింది.

(ఇంకా వుంది)

### కొత్త కారు!

పశ్చిమ జర్మనీ ప్రభుత్వ ఆదేశాల ననుసరించి, నాలుగు విశ్వవిద్యాలయాలవారు సంయుక్తంగా ఒక క్రొత్త కారును నిర్మిస్తున్నారు. దీనికి వివిధ సంస్థల సహకారంకూడా లభించింది. వీరు తయారుచేస్తున్న నమూనా కారు చాలా తేలికగా వుంటుంది. దీని బరువు 1250 కి. గ్రా.లకు మించదు. ఇంధన విషయంలో పొదుపు పాటించడం దీని ముఖ్య లక్ష్యం. 4.6 లీటర్ల డీజిల్‌తో యిది 100 కి. మీ. ప్రయాణం చేయగలదు. నాలుగు సిలిండర్లతో 2500 సి.సి. అమర్చబడిన యీ కారు ఎలక్ట్రానిక్ ట్రాన్స్‌మిషన్ యూనిట్ కలిగి వుంటుంది. కారులో ప్రయాణం చేసేవారికి సుఖంగా వుండటమే కాక, పాదచారులకు కూడా దీనివలన అంతగా ప్రమాదం కలిగించదు. గంటకు 45 కి.మీ. వేగంతో ప్రయాణం చేసేటప్పుడు ప్రమాదం సంభవిస్తే పాదచారులకు హాని కలుగదు.






బులుసు వేంకటరమణయ్య

# భగవంతుడు శాంతమూర్తి

**భ**గవంతుని మించిన శాంతమూర్తి మరి ఒకడు లేడు. శాంత స్వరూపులని పేరువడిన మహా మునులకు కూడా కోపం రావడం, శపించడం జరుగుతూ ఉంటుంది. కాని భగవంతునికి మాత్రం కోపం కలుగనే కలుగదు. తనకు అపకారం చేసిన వానికయినా సరే, తన్ను నమ్ముకున్న వానికి ఉపకారమే చేస్తాడు.

ఒక శివాలయంలో అర్చకుడు శివలింగానికి అభిషేకం చెయ్యడానికి, లింగోపరిభాగాన ఎత్తుగా ఒక వెండి కలశాన్ని కట్టివుంచాడు. దాని అడుగున ఒక రంధ్రం ఉన్నది. కలశంలో పోసిన జలం బొట్టు బొట్టుగా క్రిందనున్న శివలింగం పైని పడుతూ అభిషేక ఉపచారాన్ని చేస్తూ ఉంటుంది. శివుడు అభిషేక ప్రియుడు కాబట్టి బొట్టు బొట్టుగా జలం లింగంపయి పడితే చాలా సేపు అభిషేకం చేసిన ఫలం లభిస్తుంది.

రాత్రి అయాక అర్చకుడు గుడి తలుపులు బంధించి, తాళం వేసి తన గృహానికి వెళ్లి పోయాడు. ఆలయాలలో విలువైన వెండి బంగారాల వస్తువులు ఉంటాయని అందరికీ తెలుసును. ఒక దొంగకు ఆ ఆలయంలోని అమూల్య వస్తువులను అపహరించాలనే కోరిక కలిగింది.

వాడు అర్ధరాత్రి గుడి తలుపులు తెరిచి లోపల ప్రవేశించాడు. అక్కడ వాడికి, లింగం పైని ఎత్తుగా వ్రేలాడుతున్న వెండి కలశం తప్ప విలువైన వస్తువు మరియొకటి కానరాలేదు. దాన్ని తీసుకోవాలని వాడు నిశ్చయించాడు. కాని, అది చేతికి అందనంత మీదుగా ఉన్నది. శివ లింగంపై నిలబడితే అది అందుతుంది. అందు వల్ల వాడు "నేను ఆ శివుణ్ణే నమ్ముకున్నాను. ఆయన అనుగ్రహిస్తే ఇది నాకు దొరుకుతుంది" అని శివుణ్ణి ధ్యానిస్తూ ఆ లింగంపైకి ఎక్కి ఆ కలశాన్ని అందుకున్నాడు.

అప్పుడు మహేశ్వరుడు "నాయనా! నీ సాహసానికీ, నాపై ఉన్న విశ్వాసానికీ సంతోషించాను. దీన్ని నీవు తీసికొనిపోవచ్చు" అని ప్రత్యక్షమయి పలికాడు. తన లింగంపై కాలు పెట్టి అవమానించినా ఆ పరమ దయాళువు, దానిని లెక్కచెయ్యకుండా, తన యెడల వానికి గల దృఢవిశ్వాసానికి సంతోషిస్తూ, ఆ దొంగకు ఉపకారమే చేశాడు. భగవంతుడు శాంతమూర్తి అనుటకు ఇంతకంటె మంచి ఉదాహరణం ఏమి కావాలి?

(భగవాన్ సత్యసాయిబాబా "చిన్నకథ" ఆధారంగా వ్రాయబడినది.)



# ప్రేమమూర్తి

గంగుల నర్సింహారెడ్డి

చాలా సేపట్నుంచి నాలుక పిడుచ కట్టుకుపోయి, గొంతు ఎండుకుపోయినట్లుగా ఉంది రామలక్ష్మమ్మకు. ఇంటికి మధ్య భాగమైన విశాలమైన అంగణంలో ఓ మారుమూల చింకి చాపపై, మురికి బట్టల పడకపై అస్తవ్యస్తంగా పడుకొని ఉందామె. అక్కడ పగలు, రాత్రి ఎప్పుడూ చీకటిగానే ఉంటుంది. అందుకే ఎంత పొద్దయిందీ తెలియడంలేదు.

అంగణంలోకి ఎవరైనా వస్తారేమో, వారితో నీళ్లను తెప్పించుకుందామని అడుగుల చప్పుడు కోసం చెవులు రిక్కించి వింటుంది. తొంభై అయిదేళ్ల వయసామెది. కళ్లు కనిపించడం చాలా రోజులయింది.

వాకిట్లో పిల్లలు ఆడుకుంటున్న అల్లరి వినిపిస్తోంది కాని తన పిలుపు వాళ్లకు వినిపిస్తుందా? వినిపించినా ఆ పిడుగులు తన దగ్గరికి వస్తారా? వచ్చినా తను నీళ్లు తెమ్మంటే తెస్తారా? అని ఆలోచిస్తోందామె.

వంటింట్లో ఉన్న కమలను పిలుద్దామా అంటే మనసు జంకుతుంది. "నీ నీళ్లకోసం నన్ను అంత దూరంనుండి రమ్మంటావా?" అని కసురుకొని వెళ్లిపోతుందే తప్ప నీళ్లిచ్చి వెళ్లదు.

వంటింట్లోంచి బజ్జీలు చేస్తున్న కమ్మని వాసన ముక్కు పుటాలకు సోకింది. నోట్లో నీళ్లు ఊరాయి. 'అబ్బ, ఎన్ని దినాలాయె బజ్జీలు తినక' మనసులోనే అనుకుంది. కాని ఆమెకు తెలుసు అవి తనదాకా రావని. ఇన్ని పచ్చడి మెతుకులు తెచ్చి తన ముందు పెట్టడానికే చాలా కష్టపడిపోతున్నట్లుగా కంచాన్ని తన ముందు పగలేసినట్లుగా వెళ్లిపోయే కమల తనకు బజ్జీలు తెచ్చిపెడుతుందా?! అది, దాని పిల్లలు, మొగుడు, దాని అత్త అంతా కలిసి తింటారు.

బజ్జీలు పాడుగానూ, అవి లేకుంటేపాయె, ఇన్ని మంచినీళ్లు ఎవరైనా తెచ్చిస్తే బావుండును.

బయట వాకిట్లో ఎద్లు వచ్చినట్లు వాటి గంటల చప్పుడు, వాటిని గాటిపై కట్టివేయడానికి అదిలిస్తున్న జీతగాళ్ల గొంతులు వినిపించాయి. అంటే పొద్దు మింకిందన్నమాట!

వాకిట్లోకి ఎద్లు వచ్చాకనే వంటింట్లోకి రమ్మనిచెప్పి పంపించింది పిల్లల్ని కమల. లేకుంటే తమ చేసినవి చేసినట్లు తింటూ, కొట్లాడుకుంటూ పని తెమలనీయరు.

గడువు పూర్తయింది కదా అన్న సంతోషంతో పిల్లలు ఇంట్లోకి పరిగెత్తుకొచ్చారు.

అడుగుల చప్పుడు వినగానే శక్తినంతా కూడదీసుకొని పిలిచింది —

"ఒరే కాంతా!"

"ఏందే తాతమ్మా?" అంటూ దగ్గరికి వచ్చాడు శ్రీకాంతు.

"గిలాసెడు మంచినీళ్ళు తీసుకురా నాయినా" దీనంగా అడిగింది.

ఆదీనత్వం ఆ పిల్లవాడికేం అర్థమవుతుంది. అందుకే వాడు "నేను లేను పో" అని వెనుదిరిగాడు.

తరువాతి ఇద్దరు పిల్లల్ని కూడా పేరుపేరున పిలిచింది. కాని ఎవ్వరూ రాలేదు. బజ్జీలు తినే తొందరలో ఉన్నారు వాళ్లు.

బరువుగా నిట్టూర్చిందామె.

ఊపిరాడటం కష్టమనిపిస్తోంది.

తను చనిపోతుందా...ఇప్పుడే తనుచనిపోతుందా?

అబ్బా, అంత అదృష్టమా?! ఇప్పుడే ఇట్లనే పోయినుంటే ఎంత బావుండు?

ప్స్, తనకిప్పట్లో చావు రాదు. తనపై దేవునికింకా దయకలుగలేదు. లేకుంటే కన్న కొడుకు పోషణలో హాయిగా కళ్లుమూసి ఉండేది. తను దురదృష్టవంతురాలు కనుకనే కన్నకొడుకు చావును కళ్లారా చూసింది. ఆ తరువాతయినా హాయిగా దాటక పదిహేనేళ్ల నుండి పిల్లందరి చీత్కారంతో బతుకుతోంది.

తను దురదృష్టవంతురాలు.

తను పాపాత్మురాలు.

"పుణ్యం చేసుకున్నోళ్లకు ముసలితనంలో

చెవులు వినపడవంట! పాపం చేసుకున్నోళ్ళకు కండ్లు పోతయంటవే, మమ్మల్నందర్ని కష్టపెట్టిన పాపం ఊకెనే పోతదా అందుకే నీకు కండ్లు పోయినవే పాపపుముండా" అని తిడుతుంది తనను కోడలు చంద్రమ్మ ఇప్పుడు.

తను నిజంగానే పాపాత్మురాలా ?!

ఊరందరి కంటె బాగా బతకాలని తను ఎండనకా, వాననకా, పగలనకా, రాత్రనకా రెక్కలు ముక్కలు చేసుకొని కష్టపడి కొడుకు చేత, కోడలి చేత, మనవడిచేతా, ఒళ్ళొంచి పని చేయించిందంతా పాపమేనా ?!

బాధగా ఆలోచిస్తోందామె.

మాధవరెడ్డి తండ్రి కొండారెడ్డి చిన్న పిల్లవాడుగా ఉన్నప్పుడే రామలక్ష్మమ్మకు భర్త చనిపోయాడు. అప్పుడు వారిది ఆ ఊరిలో నిరుపేద కుటుంబం.

ఆమె ఆ చంటిపిల్లానితో ఇక్కడేం ఉంటుంది, తల్లిగారింటికి వెళ్ళిపోతుందనుకున్నారు ఊరిలోని వారంతా. కాని అందరి నమ్మకాన్ని వమ్ముచేస్తూ ఆమె ఆ ఊరిలోనే నిలదొక్కుకుంది. ఈ పనే చేయాలి, ఆ పని చేయకూడదని ఆమె ఏనాడు అనుకోలేదు. తనకు చేతనయిన ప్రతిపనీ చేసింది. కూలికి సైతం వెళ్ళింది. రాత్రనక పగలనక కష్టపడింది.

కొడుకు చేతికి ఎదిగి వచ్చాక కూడా ఆమె విశ్రమించ లేదు. "బతకాలి. ఊరిలో అందరికంటే బాగా బతకాలి" అనే కోరిక ఆమెను నిలువ నీయకుండా చేసింది.

అంబలి త్రాగి కాలం గడిపింది. ఒక్క మిరప్పొడినే కూరగా ఉపయోగించింది.

ఏదయినా సరే, సంపాదించాలనే కోరికకు అంతుండదు. అందుకే ఎప్పుడూ సంపాదించిన దానితో తృప్తి చెందలేదు. కొడుకుకు పెళ్ళి చేసే నాటికి ఆ ఊరి ధనవంతులలో ఒకరయింది.

ఏభై ఏళ్ళు వచ్చేంత వరకు కూడా ఆమె కూలీలతో సమంగా పొలంలో దిగి వరినాటేది, కలుపు తీసేది. ఆ సమయంలో అరవై ఏళ్ళ కొడుకు జబ్బు చేసి చనిపోయేవరికి గాని ఆమెకు తన వయసు తెలిసిరాలేదు. తాను ముసలి దాన్నైపోయానని ఆమెకు అప్పుడు తెలిసొచ్చింది.

లైట్లు వెలిగిస్తూ వస్తున్న అడుగుల చప్పుడుకు ఆలోచనల నుండి తేరుకుంది

ఇంట్లో ప్రతియొక్కరి అడుగుల చప్పుడు ఆమెకు సుపరిచితమే. "కమలా" అని పిలిచింది.

"ఏంది ?" విసుగ్గా అడిగింది కమల.

అంతటి విసుగులో ఉన్నామెతో తనకు నీళ్ళు తెచ్చివ్వమని ఎలా అడగాలి ? అని సందిగ్దంలో పడిపోయింది రామలక్ష్మమ్మ.

"పిలిచి, మాట్లాడవేందే, ఏం కావాలె ?"

"ఇన్ని మంచినీళ్ళు తెచ్చియమ్మా, గొంతెండుకపోతుంది."

"గొంతెండుక పోనీకె ఇదేమన్నా ఎండాకాలమా, ఎవరన్నా వింటె నవ్విపోతరు. నీకు మొదట్నుంచి ఇంకొకరికి పని చెప్పడమంటే చాలా ఇష్టం. అందుకే మనిషిని కనబడనీయవు, ఇంత పని చేస్తున్న మాకే దూప అయితలేదు. హాయిగా పండుకున్నదానికి నాలుక ఎండుకపోతుందంట" అంటూ విసురుగా వాకిట్లోకి వెళ్ళిపోయింది.

ఇటువంటి చీదరింపులకు బాధపడకుండా ఏనాడో మొద్దుబారిందామె హృదయం.

కమలకు రామలక్ష్మమ్మ అంటేనే పరమ చిరాకు. ఆ ముసలిదాన్ని ఉదయాన్నే కాలకృత్యాల కోసం లేపి తీసికెళ్ళడం, మూడు పూటలా అన్నం తీసుకువచ్చి పెట్టడమంటే ఆమెకు అసహ్యం. కాని తప్పదు కాబట్టి అలాగే. తిట్టుకుంటూ భరిస్తుంది. అదీగాక ఆమెకు పట్నాల్లో ఉండే శుభ్రత అంటే ఎంతో మోజు. పల్లెటూరులో ఉన్న తమ ఇల్లు పట్నం ఇల్లులా శుభ్రంగా ఉండాలని ఆమె ఉబలాటం. కాని ఆ మూలన మురికిబట్టల్లో గత్తు వాసనలో ముదుచుకొని మూలుగుతూ పడుకొని ఉండే రామలక్ష్మమ్మ ఉన్నంతవరకు అది సాధ్యం కాదని ఆమెకు తెలుసు. అందుకే "ఈ ముసలిది ఎప్పుడు చస్తుందిరా దేవుడా" అని దేవుణ్ని ప్రార్థిస్తూ ఉంటుంది.

కమల తిరిగి వంటింట్లోకి వెళ్ళిపోయిన చప్పుడు కూడా వినిపించింది.

మళ్ళీ ఆలోచనల్లో పడింది రామలక్ష్మమ్మ.

అన్నీ పిచ్చి పిచ్చి ఆలోచనలు.

ఆమె కెప్పుడూ ఒక అనుమానం వస్తుంటుంది. తన బతుకులో సుఖపడే యోగం రాయలేదా భగవంతుడని. పుట్టినప్పటినుండి చచ్చేంతవరకు అన్నీ కష్టాలేనా ? ఇంతమంది ఉన్నా ఆఖరుకు మంచినీళ్ళిచ్చే నాథుడు లేకుండాపోయాడే !

మరో బరువైన, ఊపిరాడని నిట్టూర్పు

వరిచేనులో కలుపు తీయించి అప్పుడే పొలం నుండి వస్తూ ఇంట్లోకి ప్రవేశించింది చంద్రమ్మ.

ఆమెకు అత్త రామలక్ష్మమ్మ అంటే ఎంతో కోపం. తను కాపురానికి వచ్చిన నాటినుండి ఎన్నో కష్టాలు పెట్టిందని ఆమెభావం. నిజంగానే కోడలును ఒక్క క్షణం తీరికగా కూర్చోనియలేదు రామలక్ష్మమ్మ. కోడికూసినప్పుడు నిద్రలేస్తే, రాత్రి ఊరంతా సద్దుమణిగాక గాని విశ్రాంతి లభించేది కాదు చంద్రమ్మకు. ఇంటిపనులు, వ్యవసాయం పనులతో ఉక్కిరి బిక్కిరిగా ఉండేది. చెప్పిన పని సరిగ్గా చేయకపోతే రామలక్ష్మమ్మ చంద్రమ్మను కొట్టిన సంఘటనలు కూడా ఉన్నాయి. ఆ పైగా ఆమె నోటి దురుసుతనం కూడా చంద్రమ్మను బాధించేది. అందుకే అత్తపై రోజు రోజుకు ఎంతో కసిని. కోపాన్ని పెంచుకుంది.

అయితే అత్త ఇంత కష్టపడినందుకే తామింత వాళ్ళమయ్యామని చంద్రమ్మ ఏనాడూ తలంచదు. కాపురానికి వచ్చిన నాటినుండి తనతో తీరిక లేకుండా పని చేయిస్తూ రామలక్ష్మమ్మ తిట్టిన తిట్లే జ్ఞాపకం ఆమెకు. అదే కోపాన్ని ఇప్పుడు నిస్సహాయ స్థితిలో ఉన్న అత్తపై ప్రదర్శించి సంతృప్తి చెందుతుంది.

అటువంటి కోడలితో నీళ్ళు తెచ్చివ్వమని అడిగితే ఏం ప్రళయం ముంచుకొస్తుందోనని భయపడింది రామలక్ష్మమ్మ. కాని నాలుక పీకుడుకు ఆగలేక ఏమయినా తిట్టనీ దానిష్టం అనుకొని పిలిచింది.

"చంద్రీ !"

వంటింట్లోకి వెళుతున్నదల్లా ఆగి "ఏందమ్మా అంత ప్రేమగా పిలుస్తున్నావ్ ఏంకావాలే" దీర్ఘాలు తీస్తూ అడిగింది.






# స్త్రీ మూర్తి

"గిలాసెడు మంచినీళ్ళు తెచ్చియ్యవే నీకు పుణ్యముంటుంది" వీలయినంత దీనంగా అడిగింది.

ఆ దీనత్వానికి కరుగలేదు చంద్రమ్మ.

"బాగుందే నీ వరుస, నేను చచ్చి బతికి చేసుకొన్నుంచి వచ్చి ఇక్కడ నీకు మళ్ళ సేవ చేయాల్నా? నాకు చేతకాదమ్మా, నేనూ మనిషినే ఆడ కూలోళ్ళతో అరచరిచి ఈడికే నా నోరు పోయింది. నీతోని పెట్టుకోవాలంటే నాకు చేతకావట్లే, మూడు పూటలా కడుపునిండా మెక్కి నీవేమైనా కోరికలు కోరుతవు" అంటూ కొంచెం దూరం వెళ్ళి మళ్ళీ ఆగి "ఇన్నాళ్ళూ నాతో చేయించుకున్నది చాలలేదే గుడ్డిముండా, ఇంకెంత కాలం సాధిస్తావు నన్ను" అంటూ వంటింట్లోకి వెళ్ళిపోయింది.

ఏడుపొస్తుంది రామలక్ష్మమ్మకు. తను లేవమంటే లేచి, కూర్చోమంటే కూర్చున్న కోడలితో ఇన్నిన్ని మాటలు పడవలసివస్తున్నందుకు... వీలుంటే ఎప్పుడో ఉరేసుకొని చనిపోయేది.

కాని ఏం చేయగలదామె. లేవడానికే శక్తి చాలదు. నిట్టూర్పులు విడుస్తూ కాలం గడుపుతుంది, కాదు కాదు చావుకోసం ఎదురుచూస్తోంది.

ముసలి బ్రతుకే ఓ బరువైన నిట్టూర్పు!

ఇంటిలో వాళ్ళవిగాక ఇంకెవరివో అడుగుల చప్పుడు వినిపించేసరికి "ఎవర్రా?" అంది ఆశగా.

"ఏందమ్మా, నేను మల్లిగాన్ని" అన్నాడు వాడు.

వాడు మాధవరెడ్డి ఆవులను కాసే జీతగాడు.

"ఏంజేస్తున్నవురా?"

"బర్ల కుడితలకు తవుడు తీస్కపోతున్నమ్మా"

"బిడ్డా చచ్చి నీ కడుపున పుడతా ఓ పని చేస్తావా?"

"ఏంది చెప్పమ్మా".

"గిలాసెడు మంచినీళ్ళు తీస్కరా బిడ్డా గొంతెండుకపోతుంది."

"అట్లనే" అని వాడు ఇంట్లోకి వెళ్ళి గ్లాసుతో నీళ్ళు తెచ్చి ఇచ్చాడు.

"నీ కడుపు సల్లగుండ" అని గటగటా త్రాగింది.

అప్పుడు ప్రాణం కుదుటపడింది.

"ఇంటి ముందల ఒకరయినా కూర్చోక ఇంట్లో ఏం చేస్తున్నార్రా" అంటూ వచ్చాడు మాధవరెడ్డి

జడ్చర్లలో వడ్లు అమ్మడానికై ఉదయం వెళ్ళి ఇప్పుడు తిరిగి వస్తున్నాడతను.

తండ్రి గొంతు విని పిల్లలు పరుగెత్తుకొచ్చారు.

తండ్రి చేతిలోని సంచిని తీసుకొని ఇంట్లోకి పరిగెత్తాడు శ్రీకాంతు.

వడ్లు ఏం ధరకు పోయావో అడుగుదామనుకొని తిరిగి ఆ ప్రయత్నాన్ని విరమించుకుంది రామలక్ష్మమ్మ. వచ్చిన వెంటనే అడిగితే కోపమయితాడని ఊరుకుంది.

అంగీ విడిచి దండెంపై వేసి పెరట్లో ఉన్న బాయి దగ్గరికి నడిచాడు మాధవరెడ్డి.

అతడు తెచ్చిన సంచిలోని కాగితం పాకెట్టును విప్పి లోపలున్న కొత్త జంబుఖానను బయటకు తీసి పరిశీలనగా చూస్తూ "ఈ జంపుఖానాను ఎందుకు తెచ్చినవు, మనింట్ల రెండెక్కువనే ఉన్నయిగా" ఆశ్చర్యంగా అడిగింది భర్తతో.

"ఏదో తక్కువ ధరకు దొరుకుతోందని తెచ్చిన ... ... ...ఎట్లయిన నాయినమ్మకు లేదుగద అందుకని" నసిగినట్లుగా అన్నాడు.

"ఆ చచ్చిపోయే ముసలి దానికిప్పుడు జంపుఖానా లేకపోతే నిద్రపడ్తలేదా, నీకేం పనిలేక తెచ్చినవు దీన్ని" వెనుకనే వచ్చిన చంద్రమ్మ అంది.

ఏం మాటాడలేదతను.

అతడు ముందే ఊహించిన విషయం ఇది.

తన జంబుఖానా నాయినమ్మ కొరకే తెచ్చానంటే ఇంట్లో ఇలాంటి నిరసన ఎదురవుతుందని తెలిసినా కొన్నాడు. అంటే అతనికి నాయనమ్మపై ఎంతో ప్రేమ ఉందనికాదు. వడ్లు అమ్మి బస్టాండుకు వస్తున్నప్పుడు రోడ్డు ప్రక్కన జరుగుతున్న వేలంలో ఈ జంబుఖానా చాలా తక్కువ ధరకు పోవడం చూసి అప్రయత్నంగానే తీసుకున్నాడు. తీసుకున్న తరువాత జ్ఞాపకం వచ్చిందతనికి, ఇంట్లో అందరికి సరిపోను రెండు ఎక్కువగానే ఉన్నాయని. అప్పుడే, నాయనమ్మకు ఏంలేని విషయం కూడా స్ఫురణకొచ్చింది. పాతబట్టల బొంతల్లో అసహ్యంగా పడుకొని ఉండే నాయినమ్మకు ఇద్దామని నిశ్చయించుకున్నాడు.

"ఇంటికి వచ్చిపోయే వాళ్ళంటరు. ముసల్ది అట్ల బొంతల్లో పడుకుంటే చూసెటందుకు బాగుంటదా?" అన్నాడు నచ్చజెప్పుతున్న ధోరణిలో.

ఏమనలేక పోయారు అత్తా కోడళ్ళిద్దరు.

కమల వంటింట్లోకి వెళ్ళి సాసర్‌లో బజ్జీలు తీసుకొని వచ్చి అతనికిచ్చింది.

"ఎందుకు చేసినవు?" అందుకుంటూ అడిగాడు

## క్యాన్సరు పోరాటంలో అభివృద్ధి !

జపానులోని క్యాన్సరు పరిశోధకులు క్యాన్సరు నిర్మూలనకు జరుపుతున్న పోరాటంలో కొంత అభివృద్ధిని సాధించారు. నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ రేడియలాజికల్ సైన్సెస్ వారు పదకొండుమంది క్యాన్సర్ రోగులకు ప్రోటాను కిరణాలతో చికిత్స జరిపారు. వారిలో ఏడుగురికి క్యాన్సరు పూర్తిగా తగ్గిపోగా, మిగిలిన నల్గురికి చెప్పుకో తగినంతగా తగ్గింది. ప్రస్తుతం జపానులో న్యూట్రాను చికిత్స బాగా అమలులో వున్నది. అయితే న్యూట్రాను కిరణాలు ప్రక్కనున్న ఆరోగ్యకరమైన కణాలను, టిష్యులకు హాని కల్గిస్తాయి. ప్రోటాను కిరణాలు కూడా హాని కల్గిస్తాయి కానీ, యిది చాలా తక్కువ. ప్రోటాన్లు విద్యుదావేశము కలవి. అందువలన అవి నేరుగా క్యాన్సరు భాగాలను తాకగలవు. ఎక్సిరే, గామా కిరణాల సహాయంతో, చుట్టు ప్రక్కలగల ఆరోగ్యకరమైన కణాలకు కలిగే హానిని తగ్గించారు.

# టాప్ స్టార్ ఉన్న కప్పు ఏది ?



## చూడండి, ఇక్కడ చిక్కని, కమ్మని టీ ఉన్నది

### చూడగానే తెలుసుకుంటారు దాని గొప్పదనం రుచిచూడగానే గ్రహిస్తారు దాని కమ్మదనం

చిక్కదనపు పరీక్ష...చేసి చూడండి...టాప్‌స్టార్ అన్నిటికన్నా మెరుగు...మరే ఇతర టీకన్నా చిక్కనిది — చిక్కదనంలో టాప్, కమ్మదనంలో టాప్.

ఎందుకంటే, ప్రత్యేకమైన భారతీయ తేయాకుల తాలూకు ఘాటైన (స్ట్రాంగ్) సమ్మేళనం నుంచి తయారైంది లిప్టన్ టాప్‌స్టార్... సంతృప్తి నిచ్చే చిక్కని, కమ్మని టీ కోరుకునే వారి కోసం!

500 గ్రా.., 250 గ్రా.. 100 గ్రా.లలో దొరుకుతుంది.

# లిప్టన్ టాప్ స్టార్ టీ




**చిక్కదనంలో టాప్, కమ్మదనంలో టాప్**




LINTAS-LTS. 8-2315 TL.







# స్త్రీ మూర్తి

"పొద్దు మింకెల పిల్లలు ఊరికే అడిగితే చేసిన"

"నాయినమ్మకు పెట్టినావా?"

"ఎన్నడు లేంది నాయినమ్మమీద శాన ప్రేమ పుట్టుకొచ్చిందే" నవ్వుతూ అంది కమల.

'ఆమెకు పెడ్తే ఎందుకు చేసింద్రా, మీకేం పనిలేదు, ఖర్చు దండుగ అని పురాణం సదువుతదిరా" అంది చంద్రమ్మ.

ఇంకేమంటాడతను ?

తిని, జంబుఖాను తీసుకొని అంగణంలోకి వచ్చి రామలక్ష్మమ్మ దగ్గరికి వెళ్లాడు.

"తిన్నావా నాయినమ్మా?"

బదులుగా మెల్లిగా మూలిగి "పాణం బాగలేదు నాయినా, పయి తిరుగుతున్నట్లుంది, అందుకే తిన్లే. అవును కాని వడ్లు ఏం ధరకు పోయినయి?" తన ఆరోగ్యం కన్నా ఈ వ్యవసాయపు విషయాలే ఎక్కువ ఉత్సుకత ఆమెకు.

"నూటేంబై రూపాయలకే అమ్మిన్నే, సరిపోతే నూకలయినయి"

"యాసంగి వడ్లు ఎక్కువ ఎండపెట్ట కూడదంటే యిన్నావా."

"అవును అప్పుడు ఎక్కువ ఎండబెట్టింది తప్పయింది, కొంచెం ప్రక్కకు జరిగి పండుకో నాయినమ్మా ఈ జంపుఖానా పరుస్తా."

"జంపుఖానా? ఎందుకురా?" ఆశ్చర్యంగ అడిగింది.

"నీకోసం కొత్తది తెచ్చిన."

"ఇయ్యాల్నో రేపో చచ్చేదానికి నాకెందుకు నాయినా కొత్తబట్టలు, వద్దుపో, మీరే ఏసుకోండ్రి"

"మా కందరికీ ఉన్నవే, ఇది నీ కోసమే తెచ్చిన."

"అట్లయితే ఇంట్లదాచిపెట్టు, ఎవరన్నా చుట్టాలొస్తే అవసరానికొస్తది."

"చెప్తే వినవు, నీ పక్కేసీదా, ఇంట్ల రెండు ఎక్కువనే ఉన్నయి" అంటూ ఆమెను ప్రక్కకు జరిపి చక్కగా పరచి తిరిగి ఆమెను పడుకోబెట్టాడు.

ఆ ముసలావిడకే ఎంతో సంబరపడిందా ముసలి ప్రాణం.

మాధవరెడ్డికి కూడా రామలక్ష్మమ్మంటే ఇప్పటికీ ఎంతో కోపం. ఎప్పుడో, ఏ క్షణానో అరుదుగా జాలికలుగుతుందామెపై.

చనిపోయే ముందు తండ్రికిచ్చిన మాటకోసం తన కోపాన్ని దిగమింగుకుంటాడతను.

మాధవరెడ్డి చదువులో మంచి తెలివి వరుడే, పదవ తరగతిలో పాసయ్యాక ఇంటర్మీడియట్‌కు జిల్లా వెళ్తానన్నాడు. కాని రామలక్ష్మమ్మ ఒప్పుకోలేదు. ఆమె ఉద్దేశ్యం వేరు. ఉన్న ఒక్కగానొక్క మనమడు చదువుకుంటే ఈ వ్యవసాయం చేయలేడు. ఉద్యోగం చేస్తానంటూ దేశాలు పట్టిపోతాడు. అప్పుడు తానిన్ని రోజులు కష్టపడి సంపాదించినదంతా ఎవరిపాలో అవుతుంది. అందుకే ఒప్పుకోలేదామె. తండ్రి ముందు ఏడిస్తే "మా నాయినమ్మ కష్టం రా" అని తప్పించుకున్నాడు.

అదే పెద్దకోపం అతనికి రామలక్ష్మమ్మ పై. తానప్పుడే చదువుకొని ఉంటే ఏదో ఉద్యోగం చేసుకుంటూ హాయిగా ఉండేవాడు. ఇప్పుడిలా అనుక్షణం కష్టపడే దుర్గతి తప్పేది. ఈ విషయం జ్ఞప్తికి వచ్చినప్పుడల్లా ఆమెను గొంతు పిసికి చంపేద్దామా అన్నంత కోపం వస్తుంటుందతనికి.

* * *

ఇప్పుడు మాధవరెడ్డి కుటుంబం హాయిగా అనుభవిస్తున్న యావదాస్తి యొక్క అణువణువులోనూ రామలక్ష్మమ్మ శ్రమ ఫలం దాగి ఉన్నా ఆమె అంటే —

తనను సాధించి, హింసించి, రాచిరంపాన పెట్టిందని చంద్రమ్మకు కోపం. తను చదువుకొని ఉద్యోగంచేయకుండా, కష్టపడే రైతులా చేసిందని మాధవరెడ్డికి కోపం. సేవలు చేయలేక, ఇల్లు అసహ్యంగా తయారవుతుందని కమలకు కోపం. పెద్దవాళ్లందరికీ కోపం కాబట్టి పిల్లలకూ మలకనే !

అయితే తనకెందుకింకా చావురాదని రామలక్ష్మమ్మకు తన పైనే తనకు కోపం.

"నేను ఇంకెందుకు బతికుండాలి దేవుడా, జల్దీ తీసుకపో" రోజలానే దేవుణ్ని ప్రార్థించి బలవంతాన కళ్లు మూసుకుంది.

* * *

"మాధవా, లేవు నాయినా" అంటూ తల్లి గొంతు కంగారుగా వినిపిస్తూ, తలుపు తట్టిన శబ్దానికి లేచి, త్వర తలుపు తెరుచుకొని అంగణంలోకి వచ్చాడు మాధవరెడ్డి. అతని వెనుకే కమల కూడా లేచివచ్చింది.

"ముసల్ది వచ్చినట్లుందిరా, పలుకుతలేదు."

వేగంగా దగ్గరికి వెళ్లాడు.

రామలక్ష్మమ్మ అచేతనంగా పడివుంది.

వంగి ముక్కుదగ్గర చేయిపెట్టి, ఆ తరువాత ఒళ్లుతాకి చూసి లేచి "చచ్చిపోయింది" అన్నాడు.

అప్పుడు కనిపించిందతనికి తను రాత్రి తెచ్చిన కొత్త జంబుఖాన, ఆమె క్రింద పడకపై ఉండాల్సిన ఆ జంబుఖానా ఆమెకు కొంచెం దూరంలో కూడదీసుకున్న శక్తితో తోసివేసినట్లుగా కుప్పగా అస్తవ్యస్తంగా పడి ఉంది.

"ఎందుకమ్మా, నాయినమ్మ ఈ జంపుఖానను ఇట్లా దూరంగా తోసింది ?" అయోమయంగా అడిగాడు తల్లిని.

ఒక్క క్షణం ఆలోచించి "చచ్చిపోయినవాళ్ల కప్పుకున్న బట్టలు, పడకమీదున్న బట్టలు చాకలోల్లు తీసుకుంటరు. తను చచ్చిపోతున్నానని తెలిసుంటుంది ముసలిదానికి. అందుకే కొత్త జంపుఖానా చాకలి వాండ్లకు పోనీయకూడదని చచ్చిపోయేముందు ఇట్ల దూరంగా జరిపుంటది..." అప్రయత్నంగా ఆమె కంఠం రుద్ధమై కళ్లనిండా కన్నీరు కమ్మింది.

మాధవరెడ్డికి కూడా ఈ మాటలు వినేసరికి ఎలాగో... ఎక్కడో హృదయంలో అవ్యక్తమైన బాధ కలుక్కుమంది.

రామలక్ష్మమ్మ చావుకోసం ఇన్నాళ్లుగా ఎదురు చూస్తున్న కమలైతే బావురుమని ఏడ్చేసింది.

కొత్త జంబుఖానను చాకలివాళ్లకు పోనీయకుండా చేశాననే తృప్తితో నిండుగా ఉంది రామలక్ష్మమ్మ వదనం !

**రు. 5,000 పైగా బహుమతులు!**

# వనితాలోకం వ్యాస రచన పోటీ

## 'నేటి వనితల ప్రధాన సమస్యలు : వాటి పరిష్కారం'

గడువు తేదీ **31-3-1982**

అతి ముఖ్యమయిన అంశాలమీద పాఠకులు చర్చలు జరిపేందుకు "ఆంధ్రపత్రిక" మొదటినుంచీ కృషి చేస్తూనే ఉంది! ఇప్పుడు మరొక 'చర్చ' కి అవకాశం కల్పిస్తున్నాము!

- ✦ మారిపోతున్న నేటి ప్రపంచంలో వనితలు ఎదుర్కుంటున్న ప్రధానమయిన సమస్యలు ఎటువంటివి!
- ✦ వాటి పరిష్కారానికి ఏమి చేస్తే బాగా ఉంటుంది!

ఈ ప్రశ్నలకి తమకి తోచిన సమాధానాలని వివరిస్తూ ఆంధ్రపత్రిక నిర్వహిస్తున్న వ్యాసరచనపోటీలో పాల్గొనవలసిందిగా వనితాలోకాన్ని కోరుతున్నాము!

వ్యాస రచన పోటీకి ఈ కిందివిధంగా బహుమతులు ఏర్పాటు చేస్తున్నాము.

| | | | |
|---|---|---|---|
| మొదటి బహుమతి | రు. 1000 | రెండవ బహుమతి | రు. 900 |
| మూడవ బహుమతి | రు. 800 | నాలుగవ బహుమతి | రు. 700 |
| ఐదవ బహుమతి | రు. 600 | ఆరవ బహుమతి | రు. 500 |

ఇవికాక రు. **150** చొప్పున **5** ప్రత్యేక బహుమతులు!

అంతేకాక పోటీలో పాల్గొన్న వారందరికీ బహుమానాలుంటాయి!

వనితాలోకం ఉత్సాహంతో ఈ పోటీలో పాల్గొని దానిని విజయవంతం చెయ్యగోరుతాము!

ప్రశ్నాపత్రం, నిబంధనలు ఆంధ్రపత్రిక దిన పత్రికలో చూడండి!



# సినిమా



'నిప్పుతో చెలగాటం'లో కృష్ణంరాజు, విజయలలిత

## 'శంకరాభరణం'లా తోడిరాగం

"తోడిరాగం" అనే తమిళ చిత్రం తయారీలో ఉంది. 'శంకరాభరణం' శంకరశాస్త్రిలాగానే తోడి రాగం పాడడంలో సుప్రసిద్ధుడు సుందరం. (ఈ పాత్రకు ఒక సంగీత విద్వాంసునే ఎన్నిక చేశారు.) ఆ గాయకుడు ఎన్నో లక్షలు సంపాదించాడు. కాని, అంతా దుర్వ్యయం చేశాడు. అతని తోడిరాగ గానానికి పరవశత్వం చెంది, అతన్నే పరిణయమాడాలని కలలు కంటుంది మనోన్మణి అనే నరక్తి. విలాసం కుట్రలవల్ల సుందరంకు కచ్చేరీలు కరువవుతాయి. చివరికి చితికిపోతాడు. జీవితం మీద విరక్తి చెంది (మామూలుగా మీసాలు గడ్డాలు పెంచేసి) దీనావస్థలో ఉన్న అతన్ని మామూలు స్థాయికి తీసుకెళ్లడానికి ప్రయత్నిస్తుంది మనోన్మణి. తోడిరాగం' అంటే ఏమిటో శాస్త్రీయ సంగీతం తెలియని వారికోసం "తోడిలో పాడుతా" అనే ఎనిమిదిన్నర నిమిషాల పాట ఈ చిత్రంలో ఉంది. ఈ చిత్రానికి ప్రముఖ వయొలిన్ విద్వాంసుడు కున్నక్కుడి వైద్యనాథన్ నిర్మాత, సంగీత దర్శకుడు

'డాక్టర్—సినీ యాక్టర్'లో కృష్ణ, జయసుధ—కృష్ణ, కవిత

# విశేషాలు

-జి. వి. జి.

## రాఘవేంద్రరావు దర్శకత్వంలో కృష్ణ, శోభన్

ఆగస్ట్‌లో రాజస్థాన్ ఎడారులలో ప్రారంభమయ్యే కృష్ణ ఎంటర్‌ప్రైసెస్ వారి విఖ్యాత జానపద చిత్రాన్ని కృష్ణ సమర్పిస్తారు. ఆయనతో పాటు శోభన్‌బాబు నటించే ఈ చిత్రం హిందీలో కూడా ఒకేసారి తయారవుతుంది. ఒక హీరో జితేంద్ర. మరో హీరో ఎవరో త్వరలో నిర్ణయమవుతుంది. కె. రాఘవేంద్రరావు దర్శకుడు.



'ప్రేమమూర్తులు'లో రాధ, శోభన్‌బాబు

## దర్శకుడుగా దాసరి మరో శిష్యుడు నందం హరిశ్చంద్రరావు

దాసరి నారాయణరావు ప్రియ శిష్యులలో నందం హరిశ్చంద్రరావు ఒకరు. ఉత్తమాభిరుచి, ఉన్నతమైన ఆశయాలు గల ఈ యువకునికి ఇంత కాలానికి దాసరి పర్యవేక్షణలో ఒక చిత్రానికి దర్శకత్వం వహించే అవకాశం వచ్చింది. అది వడ్డే శోభనాద్రి ఏప్రిల్‌లో నిర్మాణం ప్రారంభించే చిత్రం. శోభన్‌బాబు హీరో. వడ్డే రమేష్ నిర్వహణలో వడ్డే కిశోర్ సమర్పిస్తారీ విజయ మాధవీ పిక్చర్స్ చిత్రాన్ని.

'కృష్ణార్జునులు'లో జయప్రద, శ్రీదేవి



'శ్రీనాథ్ మూవీస్‌వారి మొదటి చిత్రం'లో శోభన్‌బాబు, శ్రీగంగ, మురళీమోహన్

## ఆపద్బాంధవులులో పాపానికి ప్రాయశ్చిత్తం

ఆ గ్రామంలో ఆపదల్లో అందర్నీ ఆదుకునే ఆపద్బాంధవులు రామయ్య (పద్మనాభం), కిష్టయ్య (రాళ్ళపల్లి), రహీం (సాక్షి రంగారావు) చాపలమీద మూల్గుతూ పడుకొని ఉన్నారు. శివయ్య (మాడా) వేడినీళ్ళ కాపడం పెడుతున్నాడు.

కిష్ట : తనకు మాలిన ధర్మం మొదలు చెడ్డ బేరమని అందుకే అన్నార్రా.

రామ : అవున్రా. పెసిడెంటుగారు పెళ్ళాన్ని కొట్టడం ఈ శివయ్య సూడనేల — ?

రహీ : సూసినాడు పో –మనందరికీ సెప్పనేల?

కిష్ట : సెప్పినాడు పో — మనం ఆ మొగుడు పెళ్ళాల్ని కలపాలని ఆ గ్రామసేవిక ఇంటికి పోనేల—?

రామ : ఇంటికి పోతిమి పో — ఆవిడ వీరకొంగు నా చేతికి చిక్కనేల — ?

రహీ : చిక్కెను పో — జనం అది చూడనేల?

కిష్ట : చూసేను పో — మునసబుగారు మన వాళ్ళ పరాభవం సేయనేల—? అమ్మా!

హఠాత్తుగా తలుపులు తెరుచుకున్నాయి భూషయ్య (ఎర్రంనేని) కొరడాతో వచ్చాడు "క్షమించమని అడగడానికి వచ్చాను. మీరు అమాయకులని నాకు తెలుసురా. ఇంతటి అఘాయిత్యానికి మీరు తలపడరని తెలుసు. కాని, జనం ముందు నేనలా నటించక తప్పలేదు. చెప్పండిరా — మీరెందుకు అబద్ధం చెబుతున్నారు ? మీ వెనక నిలబడి మిమ్మల్ని ఆడిస్తున్న వ్యక్తి ఎవరూ ? మీకేం భయం లేదు. మీ పేర్లేం బయటకు రానివ్వను. నిజానిజాలు నేను తేల్చుకుంటాను. చెప్పండిరా!" అన్నాడు గంభీరంగా.

"లేదు, దొరా! ఆ రాత్రి మేము కావాలనే ఆ ఇంటికి పోయాం," అన్నాడు కిష్టయ్య.

"అబద్ధం! మీరు సాధు జంతువులాంటివారు. ఒకరికి ఉపకారం చేయడమేగాని, అపకారం తలపెట్టే తత్త్వం కాదు మీది. నన్ను మీరు మోసం చేయలేర్రా! చెప్పండి — ఎవరా వ్యక్తి ? ఒక్కటే మాట. మీరు నిజమన్నా చెప్పండి. లేదా — ఒక్కొక్కరూ నా తప్పుకు శిక్షగా పదేసి కొరడా





దెబ్బలు నన్ను కొట్టండిరా! మిమ్మల్ని అన్యాయంగా శిక్షించిన పాపానికి నాకు ప్రాయశ్చిత్తం కావాలి!" అంటూ కొరడాను పడేయగా — ఆపద్బాంధవులు అవాక్కయిపోయారు.

వై. ఈశ్వరరెడ్డి కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో ఛాయాగ్రాహకుడు వి. ఎస్. ఆర్. స్వామి నిర్మించిన శ్రీ అపర్ణా మూవీస్ "ఆపద్బాంధవులు" చిత్రం విడుదలకు సిద్ధంగా ఉంది. శ్రీధర్, శారద, గీత, చక్రపాణి, ఎస్. వి. జగ్గారావు ఇతర పాత్రధారులు. పరుచూరి మాటలు, సత్యం సంగీతం. డి. వెంకటరత్నం కూర్పు నిర్వహించారు.

### "ఇంకా తెలవారదేమి ?"

అభ్యుదయ ఆర్ట్ క్రియేషన్స్‌వారి ఈ చిత్రానికి ఫిబ్రవరి 17న తొలి గీతం రికార్డయింది. "పాత ఆర్టిస్టులతోపాటు కొందరు కొత్త ఆర్టిస్టులను కూడా ఎన్నుకుంటాం," అన్నారు. "పునాదిరాళ్ళు" అనంతరం ఈ చిత్రానికి స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహించే గూడపాటి రాజకుమార్ బొల్లిముంత శివరామకృష్ణ సంభాషణలకర్త సి. నారాయణరెడ్డి, గోపి, మైత్రేయతోపాటు దర్శకుడు కూడా రాసిన గీతాలకు ప్రేమ్‌జీ స్వరకల్పన చేశారు. వి. ఎస్. ఆర్. కృష్ణారావు ఛాయ, రంగారావు శిల్పం, చంద్ర సహదర్శకత్వంతో ధ్రువకుమార్ నిర్వహణ బాధ్యతలు వహిస్తున్నారు. "మార్చి 1 నుండి సింగరాయకొండ ప్రాంతాలలో షూటింగ్ జరుపుతాం," అని నిర్మాతలు బి. పుల్లయ్య, ఎస్. సత్యం తెలియజేశారు.

'విప్లవ సింహం' లో



## కోరుకున్న మొగుడులో స్వార్థపరులు

లక్ష్మి కారుదిగి, ఆఫీసు లోపలకు నడిచింది ఆమె వెంట మేనేజర్ ప్రవేశించాడు. అక్కడ హాలులో ఎదురుచూస్తున్న బ్రాంచ్ మేనేజర్లు ఒక్కసారిగా లేచి నిలుచొని, విష్ చేశారు వాళ్ళ ఎదురుగా నిలుచొని లక్ష్మి "మీ అందర్నీ ఒకేసారి ఎందుకింత సడన్‌గా పిల్చానో తెలుసా? లాభనష్టాలు లెక్కవెయ్యడానిక్కాదు; మంచి చెడ్డలు మాట్లాడ్డానికి పిలిచాను. నేను ఆశించిన మంచి జరక్కపోగా, మీ వల్ల చాలా చెడు జరుగుతోందని తెలిసి హెచ్చరించడానికి పిలిచాను ... మిస్టర్ చలపతిరావ్గారూ ! మీ బ్రాంచ్‌లో మన కంపెనీ లేబుల్స్‌తో కల్తీ మందులు అమ్ముతున్నారా - లేదా ?" అని గద్దించింది

"అబ్బే ! అలాంటిదేం లేదు, మేడమ్ !" అంటూ నీళ్ళు నమిలాడు చలపతి.

"లేకపోతే, పోలీసులు గోడౌన్‌లోని మందులన్నీ సీల్‌చేసి, నాకెందుకు రిపోర్ట్ చేస్తారు? ఒక మనిషిని మరో మనిషి కత్తిపెట్టి పొడిస్తేనే హంతకుడవడు, మిస్టర్ ! ప్రాణాలతో ఆడుకునే ప్రతి స్వార్థపరుడూ హంతకుడే అవుతాడు యు ఆర్ డిస్‌మిస్డ్ ఫ్రమ్ మై సర్వీస్," అని ఆవేశంతో అంటున్నప్పుడు లక్ష్మికి విపరీతంగా దగ్గు వచ్చింది టేబుల్ మీదున్న గ్లాసులోని నీళ్ళు తాగి, "వాట్ అబౌట్ యు మిస్టర్ బన్సీలాల్ ? మీ బ్రాంచీలోని వర్కర్లకు బోనస్ ఎందుకివ్వలేదు ? మూడునెలల నుంచి వంద మంది కూలీలకు జీతాలు ఎందుకివ్వడం లేదు ?" అని అడిగింది.

"బోనస్‌లు కిందటి నెలే ఇచ్చేశాను, మేడమ్!" అన్నాడు బన్సీలాల్.

"నో ... ఇస్తానని వాళ్ళతో చెప్పారు. ఇచ్చానని నాతో చెప్పారు కాని, వాళ్ళకు ఇవ్వలేదనీ తెలుసు ఆ డబ్బంతా నువ్వు కాజేశావనీ తెలుసు గంట క్రితం మీ ఇంటిమీద దాడి చేసిన ఇన్‌కమ్‌టాక్స్ వాళ్ళకి మీ ఇంట్లో అయిదు లక్షలు హార్డ్ కేష్ దొరికింది. ఎక్కడిది మీ కంత డబ్బు ?"

బన్సీలాల్ ఉగ్రుడయ్యాడు, "యూ చీట్ ! మీటింగుకని పిలిచినట్టే పిలిచి, ఇంత మోసం చేస్తావా ?"

"షటప్ ! మోసం చేసిందెవరు ? మీరా - నేనా ? మీకు ఉద్యోగాలు ఇచ్చినందుకు నన్ను మోసం చేశారు. మీ దగ్గర ఉద్యోగాలు చేస్తున్నందుకు మీ వర్కర్లని మోసం చేస్తున్నారు," అని వాళ్ళందరూ చేసిన దగాలను వివరిస్తూ లక్ష్మి ఆవేశంతో స్పృహ తప్పి పడిపోయింది

అందరూ గుడ్లప్పగించి చూస్తూండిపోయారు.

కట్టా సుబ్బారావు స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో జాగర్లమూడి రాధాకృష్ణమూర్తి నిర్మించే విష్ణుప్రియా ప్రొడక్షన్స్ "కోరుకున్న మొగుడు" చిత్రంలో ద్విపాత్రధారి శోభన్‌బాబు సరసన లక్ష్మి, జయసుధ నాయికలు సత్యనారాయణ, నూతన్ ప్రసాద్, రమాప్రభ, ఎస్ వరలక్ష్మి, నాగభూషణం, మాడా, వంకాయల, రూపాచక్రవర్తి పాత్రధారులు. కాశీ విశ్వనాథ్ సంభాషణలకర్త వేటూరి గీతాలకు సత్యం స్వరకల్పన చేశారు చెంగయ్య ఛాయ, వాలి శిల్పం, ఎస్.పి.ఎస్ వీరప్ప కూర్పు, బి ఎల్లమంద నిర్వహణలో అశోక్‌కుమార్ ప్రొడక్షన్ కంట్రోలర్


చిరంజీవి, రజనీకాంత్


'మనసా కవ్వించకే'లో కవిత

### శాయికృష్ణా ఆర్ట్ ఫిలిమ్స్ తొలి చిత్రం

"దాసరిగారి ఆశీస్సులతో చిత్ర నిర్మాణానికి ఉపక్రమించాను ఆయనే కథ, స్క్రీన్‌ప్లే కూడా సమకూర్చారు," అన్నారు గంధమనేని రమేష్‌చంద్రప్రసాద్ ఈయనకు లోగడ "ఇదెక్కడి న్యాయం, కోరికలే గుర్రాలయితే, స్వప్న" చిత్రాలతో సంబంధముంది. ఈయన సంస్థకు ఫిబ్రవరి 18న ప్రారంభోత్సవం జరిగింది. కాశీ విశ్వనాథ్ సంభాషణల కర్త. సత్యం సంగీత దర్శకుడు మార్చి 20 నుంచి ఏప్రిల్ 8 వరకు ఒకే షెడ్యూల్‌లో చిత్రీకరణ పూర్తవుతుంది. "చంద్రమోహన్ హీరో," అన్నారు డైరెక్టర్ ఎం. ఎస్. కోటారెడ్డి.



'చిలిపి చిన్నోడు' లో కమల్ హాసన్, కవిత

## చరిత్ర చిత్ర నిర్మాణం "ఇద్దరు కిలాడీలు"

"ఒక కుగ్రామంలో దుష్టులను శిక్షించి, శిష్టులను రక్షించే యువకులుగా భానుచందర్, సుమన్ నటిస్తున్నారు. ఈ చిత్రంలో మార్షల్ ఆర్ట్స్, జూడో ఫైట్స్ ప్రత్యేకత. ఈ యువకులిద్దరికీ బ్లాక్ బెల్ట్ హోల్డర్ జూడో రాజ్ (ఫస్ట్ డిగ్రీ) ప్రత్యేకంగా శిక్షణ ఇస్తున్నారు. పైగా, సుమన్ కరాటే బ్రౌన్ బెల్టర్. డూప్‌లు లేకుండా ఫైట్ చేస్తారు గనుక ప్రేక్షకులకు చాలా థ్రిల్లింగ్‌గా ఉంటుంది. ఇంకా చాలామంది జూడో ఫైటర్స్ కూడా ఉంటారు. రమణమూర్తి, మాతవ్‌ప్రసాద్, రాళ్ళపల్లి, పి. ఎల్ నారాయణ, మాడా, నిర్మల ఇతర నటవర్గం కథానాయికలుగా ఇద్దరు కొత్త యువతులను పరిచయం చేస్తున్నాం నాకుకూడా ఇది తొలి యాక్షన్ పిక్చర్" అన్నారు డైరెక్టర్ రేలంగి నరసింహారావు. భరత్ కథకుడు ఈయనతో పాటు కాశీ విశ్వనాథ్ సంభాషణలు రాశారు ఎన్నో మలయాళ చిత్రాలలో పాటలను హిట్స్ చేసిన జాయ్ ఈ చిత్రానికి తొలిసారిగా సంగీత మిస్తున్నారు కోటేశ్వరరావు ఛాయ, లీలాకృష్ణ శిల్పం, మురళి కూర్పు, బి. ఎల్. వి. ప్రసాద్ సహదర్శకత్వం నిర్వహిస్తున్నారు. శ్రీశ్రీ, గోపీ పాటలను రాశారు "మార్చి 1 నుండి రాజమండ్రి సమీపాన గూటాల ప్రాంతాలలో షూటింగ్ జరుగుతుంది," అన్నారు నిర్మాత తమ్మారెడ్డి వి. కె

## శృంగార చిత్రాలు

★ ఈ ఏడు జనవరి 12 నుంచి స్కాట్లండ్‌లోని స్టాత్ క్లయిడ్‌లో 11 రోజులపాటు 'బ్లూ ఫిలిమ్ ఫెస్టివల్' జరిగింది. ఈ చలన చిత్రోత్సవంలో పలు సెక్సీ చిత్రాలు ప్రదర్శింపబడ్డాయి.

★ 1938 లో "వనరాజ్ కర్జన్" అనే తమిళ చిత్రంలో కె. ఆర్. చెల్లం అనే నటి తొలిసారిగా స్విమ్మింగ్ దుస్తులలో కనిపించింది. ఫలితంగా మహిళలు నిరసనను తెల్పారు తమిళ పత్రికలు తీవ్రంగా విమర్శించాయి. చివరికి ఆ చిత్రం ప్రదర్శింపబడే థియేటర్ల ముందు ప్రేక్షకులు అభ్యంతరాన్ని తెలియజేయడంతో ఆ దృశ్యం తొలగించబడింది.

★ ఇటీవల కొన్ని తమిళ చిత్రాలలో చుంబన దృశ్యాలు చిత్రీకరింపబడ్డాయి "త్యాగి"తో శ్రీప్రియను శివాజీగణేశన్, "ఆయిరం ముత్తంగళ్" (వెయ్యి ముద్దులు) చిత్రంలో రాధను శివకుమార్, "అర్చన పూగళ్"లో సువితను చంద్రశేఖర్, "ఊరవిషక్కావ్యంగళ్"లో రాధికను ప్రతాప్ పోతన్ చుంబించే దృశ్యాలు చిత్రీకరింపబడ్డాయట. వీటిని ప్రేక్షకులు చూసే అవకాశం సెన్సార్ కత్తెర దయ మీద ఆధారపడి ఉంది.

★ సుదీర్ఘమైన చుంబన దృశ్యం గల ఆంగ్ల చిత్రం "యు ఆర్ ఇన్ ది ఆర్మీ నౌ" 1941 లో విడుదలైంది. జాన్‌వెయిన్, కాజీన్‌డూమెయిన్ 3 నిమిషాల 5 సెకెండ్లపాటు గాఢ పరిష్వంగంలో గడుపుతారు.

## దాసరి దర్శకత్వంలో ఎ. ఎన్. ఆర్. ద్విపాత్రాభినయం

"మార్చి 24 నుంచి అన్నపూర్ణ స్టూడియోలో షూటింగ్ ఉంటుంది," అన్నారు దాసరి నారాయణరావు. ఈయన కథ, స్క్రీన్ ప్లే, మాటలు, పాటలు, దర్శకత్వంతో ఎన్. ఆర్ అనురాధాదేవి నిర్మించే లక్ష్మీ ఫిలిమ్ కంబైన్స్ "రాముడు కాదు కృష్ణుడు"లో ద్విపాత్రలు నిర్వహించే ఎ. ఎన్. ఆర్. సరసన ఇద్దరు 'జయ'లు నాయికలు. "మార్చి మొదటి వారంలో చక్రవర్తి మ్యూజిక్ డైరెక్షన్‌లో మూడు సాంగ్స్ రికార్డు చేస్తాం," అన్నారు "శ్రీవారి ముచ్చట్లు" అనంతరం ఈ చిత్రాన్ని సమర్పించే నంగునూరు శ్రీనివాసరావు.



"విటమిన్ 'ఏ' ఉన్న పదార్థాలు తిను! అట్లాగే, 'ఏ' సర్టిఫికెట్ సినిమాలు చూడ్డం మానెయ్యి!"

## శ్రీరాం ఫిలిమ్స్

"గీత తొలిసారిగా మా చిత్రంలో ద్విపాత్రాభినయం చేస్తుంది," అన్నారు ప్రముఖ ఛాయాగ్రాహకుడు, దర్శక నిర్మాత జానకిరాం. "నిజం నిరూపిస్తా" చిత్రం తర్వాత ఈయన కొన్ని విజయవంతమైన కన్నడ చిత్రాలు రూపొందించారు "మన మాతృభాషను ఎలా మరువగలను? మంచి సబ్జెక్ట్ దొరికింది. ఫిబ్రవరి 17న పాటలు రికార్డు చేయించా. మార్చి20న షూటింగ్ మొదలెట్టున్నా," అన్నారు జానకిరాం. మురళీమోహన్ హీరో. మోహన్, పుష్పలత ఇతర పాత్రధారులు. మాటలు, పాటలు గోపీ రాశారు. రమేష్‌నాయుడు సంగీత దర్శకుడు. బి. ఎస్. కృష్ణ శిల్పం, గోపాలకృష్ణ నిర్వహణ బాధ్యతలు వహిస్తారు.

శ్రీమతి – కాశ్యా

సీరియల్

(గత సంచిక తరువాయి)

అప్పటికి వారం రోజుల్నుండీ ఇంట్లో వస్తూన్న మార్పుల్నీ, అత్తా ఆడపడుచుల మాటపోటీ మాటల ధోరణినీ గమనించుతూన్న తార వెంకటరత్నం ఉత్తరం చూడగానే ఒక అభిప్రాయాని కొచ్చింది. అతడు వ్రాసిన విధంగా చేయటానికే నిశ్చయించుకుంది.

''అత్తయ్యా! మీ అబ్బాయి ఉత్తరం పంపించారు. నన్నూ, పిల్లలనూ రమ్మని వ్రాసారు.''

'వెళ్ళనా' అన్నట్లుగా అడుగుతూన్న ఆ ధోరణి గమనించి, ఈ సమస్య ఇంత త్వరగా తీరిపోతున్నందుకు ఎంతగానో ఆనందపడ్డారు.

''మామగారితో చెప్పివెళ్తే బాగుంటుందేమో!'' అని నాలుగైదుమార్లు అనుకుంటూ తచ్చాడుతూన్న కోడల్ని ''నేను చెబుతానులే. ఫర్వాలేదు! నువ్వెళ్ళు. అవతల మనిషి కాచుకుని కూర్చున్నాడు కదా!'' అంటూ కాస్త తొందరచేసి పంపించేసిందనే చెప్పుకోవచ్చు!

అది పూర్తిగా సత్యవతి తప్పు అని అనలేం. ఆనాటి పరిస్థితులు అలాంటివి!

అసలే సత్యవతి – తారల మధ్య ఉన్న సన్నిహితత్వం అంతంత మాత్రం! అలా కాకుండా ఎంతో ప్రాణంగా ఉండే మనుషుల మధ్య కూడా ఇలాటి దురాగతాలు ఎన్నో అఘాతాలను సృష్టించాయి!

ఎంత ఇష్టమున్నా కూడా చూస్తూ చూస్తూ నిప్పుని కొంగున ముడివేసుకోలేరు కదా! కావాలనుకున్నవాళ్ళ కోసం ఎంత కష్టపడటానికయినా వెనుదీయకపోవడానికి కూడా ఎంతో మనస్థైర్యం కావాలి! అది అందరికూ చేతకాదు! ఎలాటి ఆటుపోటులకూ చలించని దృఢ సంకల్పం అందరకూ ఉండదు! అలాటప్పుడు అతి సామాన్యమయిన సత్యవతి అంతకంటె గొప్పగా ఎలా ప్రవర్తించ గలుగుతుంది?

*   *   *

గుడివాడలో తారం పుట్టింటికి చేరుకున్నవాటికి ఏదో సామెత చెప్పినట్లుగా ఉన్నది ఆయన పరిస్థితి!

ఓడలు – బళ్ళు అయిపోయాయి!

రామారావు దాదాపుగా ఇంటికి దూరమైపోయాడనే అనవచ్చు! రాఘవయ్యగారంతటి తెలివయిన మనిషి కూడా భాగస్వామిని నమ్మి మోసపోయి వ్యాపారంలో బాగా దెబ్బతిన్నారు!

అది రాఘవయ్యగారికి కేవలం ఆర్థికమైన దెబ్బే కాకుండా – ఆయన మానసికంగా చాలా కృంగిపోయారు. ఎంతో జాగ్రత్తగా చూసుకుంటూ, చిన్నదిగా ప్రారంభించిన – కేవలం తన దీక్ష మూలంగానే, తన చాకచక్యంవల్లనే పదింతలుగా పెంచిన ఆ వ్యాపారంలో ఏనాడయినా ఇలాటిది ఎదురవుతుందేమో అని ఊహగాకూడా ఆయనెప్పుడూ ఆలోచించలేదు. అలాంటిది ఒక్కసారిగా ఆ భాగస్వామి మోసం చేయటం – ఆయనకు ఏమరుపాటుగా ఉన్న సమయంలో బలమైన వస్తువుతో మాడుమీద గట్టిగా కొట్టినట్లయింది.

ఆ వయసులో మానసిక వ్యధకంటె పెద్ద అనారోగ్య మింకొకటి ఉండదు ఎవరికైనా! దానికి తగినట్లుగా నాగరత్నమ్మ విపరీతమైన ధోరణి! తెలిసి కొంతా, తెలియక కొంతా ఆమె చేసే పనులకు ఇంత కాలం రాఘవయ్యగారు నయానా భయానా మందలించుతుండేవారు! ఇంక ఇపుడు ఆయనంటే భయమే లేదు! పైగా ఆయన ఏ విషయాలనైతే మరచిపోవటానికి ప్రయత్నం చేస్తున్నారో – వాటినే పదే పదే ఎత్తి చాలా హేళనగా, వ్యంగ్యంగా విసుర్లు విసురుతూండేది! అది రాఘవయ్యగారిని చాలా తీవ్రంగా గాయపరచేది! విపరీతంగా బాధపడిపోయేవారు! ఏం చేయటానికీ శక్తి లేనట్లుగా డీలా పడిపోయిన రాఘవయ్యగారిని చూస్తే ఆమెకేమాత్రం అభిమానం, గౌరవం కలిగేవి కావు!

ఆయనకు అన్నం పెట్టి, ఎదురుగా కూర్చుని మరీ తిట్టేది! ఇక – ఆయనకు ముద్ద మింగుడు పడేదికాదు! పనికిరాని మనిషిగా, చేతగాని వ్యక్తిగా ఆవిడ మనసులో ముద్రించుకుపోయారు! ఫలితంగా రాఘవయ్యగారు మంచమెక్కారు.

ఈ మానసిక సంక్షోభానికి జతగా వార్తాపత్రికలలోని విషయాలు మరీ కలవరపాటును కలిగిస్తున్నాయి. అల్లుడు ఎలా ఉన్నాడో, కూతురు ఏ చిక్కుల్లో ఉన్నదో అని అహర్నిశలూ సతమతమైపోతున్నారు.

కొందరు మనుషులు ప్రతి చిన్న విషయానికీ సతమతమవుతారు. ఎంతో పెద్ద కష్టం వచ్చిందని వాపోతూ ఉంటారు. అలాటివారు రోజూ లేచిన దగ్గర్నుండీ పడుకునేవరకూ గంటకో కష్టం చొప్పున ఎదురవుతూనే ఉందని భావిస్తుంటారు. పదిమందికీ చెప్పుకుని వాళ్ళ సానుభూతిని పొందితే గానీ వాళ్ళకు మనశ్శాంతి ఉండదు!

కాని, కొందరు అలాకాదు. ఎంతో పెద్ద సమస్య ఎదురయితేనేగానీ వాళ్ళల్లో చలనం కన్పించదు. అపుడుకూడా గాంభీర్యం ముసుగులో దాచుకుని బయటకు కన్పించనీయకుండా ఆ సమస్యను ఎలాగో చక్కబెట్టుకోవటానికే ప్రయత్నిస్తారు! అందులోకూడా పరాజితులైనవాడు, ముఖ్యంగా పదిమందికీ తెలిసిపోయిననాడు – 'పరువుప్రతిష్ఠ వేలంపాటలో పోతున్నాయనీ, అన్నీ పోగొట్టుకుని పదిమందిలో పలచన అయ్యామే అనీ, దానికి కేవలం తమ అజాగ్రత్తే కారణమనీ' చాలా డీలాపడిపోతారు. ముఖం చూపడానికే సిగ్గుపడిపోతారు! లోపల్లోపలే కుళ్ళిపోతుంటారు!

పైకి ఏడ్చేసేవాడు త్వరగా దుఃఖాన్ని మర్చిపోయి మళ్ళీ మామూలుగా అయిపోతాడు. వాడికి రోజూ చావటం అలవాటే! అలాటివాడు రోజుకు ఒక్కసారేకాదు, గంటకోసారయినా ఛస్తూ బ్రతుకుతూంటాడు. అది వాడి జీవితంలో ఒక భాగమైపోతుంది!

కానీ, రాఘవయ్యగారి లాంటివారు పైకి ఏడవరు! తమ దుఃఖాన్ని పదిమందికీ పంచరు! మనసులోనే క్రుంగిపోతుంటారు! మళ్ళీ లేవటానికి వీలవనంతగా తగిలిన ఆ దెబ్బనుండి నిజంగానే కోలుకోలేకపోయారు!

ప్రసాదు తారను కాదన్ననాడూ, స్వగ్రామంలో ఆస్తి అంతా అమ్మేసుకున్నవాడూ, జలగలా పట్టి పీడించే అనారోగ్యంతో భార్య బాధపడ్డవాడూ, చిన్నకూతురు సంసారంలోని ఒడిదుడుకులను విన్ననాడూ, ఇత్తడి కొట్టు అంతా అప్పులపాలు చేసి చిన్న అల్లుడు మద్రాసుకు పారిపోయిననాడూ – ఏనాడూ ఆయన ఇంతగా క్రుంగిపోలేదు! ఎంతో పెద్ద పెద్ద తుఫానుల్లాటి విషయాలను కూడా అతి స్వల్పాలుగా ఎంచి ధైర్యంగా, యుక్తిగా వాటికి ఎదురునిలిచి గెలిచిన రాఘవయ్యగారు – ఈసారి మాత్రం చిత్తుగా ఓడిపోయారు!

అలాటి సమయంలోనే ఒకసారి అటువైపు ఏదో పనిమీద వచ్చిన ప్రసాదు అక్కనూ, బావనూ

**జరిగిన కథ–15** కమ్యూనిస్టు పార్టీ ప్రముఖులలో ఒకడుగా పేరు తెచ్చుకుంటాడు వెంకటరత్నం. ఎవరెన్ని విధాల నచ్చచెప్పినా వినక వెంకటరత్నాన్నే పెళ్ళి చేసుకుంటుంది తార. ప్రకాశం మంత్రివర్గం ఏర్పాటయిన తరువాత కమ్యూనిస్టుపార్టీని నిషేధించింది. తత్ఫలితంగా వెంకట్‌ను పట్టుకోవడానికి విశ్వప్రయత్నం చేస్తుంటుంది పోలీసుశాఖ. అతనిప్పుడు పూర్తిగా వేషం మార్చేసి తప్పించుకు తిరుగుతుంటాడు. తమకి దొరక్కుండా తప్పించుకు తిరుగుతున్నాడనే కోపంతో వెంకట్ ఇంటిపై మెరుపు దాడులు చేస్తూ అతని కుటుంబ సభ్యులతో చాల అసభ్యంగా, అమానుషంగా ప్రవర్తించుతుంటారు పోలీసులు. వెంకట్ ఆజ్ఞపై తార పిల్లలతో పుట్టింటికి వెళ్తుంది.

యూసేందుకు ఇంటికి వచ్చాడు. ఇంట్లోని పరిస్థితులను చూసి అవాక్కయాడు! రాఘవయ్యగారి పరిస్థితులు విని చాలా జాలిపడ్డాడు! కాని, ఏమాత్రం సానుభూతి చూపించినా ఆయన తట్టుకోలేరని అతనికి బాగా తెలుసు! అంతేకాదు అక్కగారి విపరీత ధోరణికి ఆయన మరింతగా క్రుంగిపోతున్నారనీ తెలుసు! కానీ, ఆవిడ వినే రకమా! అక్కడికీ అక్కకు చాలా రకాలుగా చెప్పి మందలించాడు. తమ్ముడు చెప్పేది విని అర్థం చేసుకోవటానికి బదులు అతనిమీద గయ్‌మంది. 'కడుపులో చల్ల కదలకుండా ఉంటే వీలాగా తాంబూలం కబుర్లు నేమా చెబుతానురా' అంటూ తీసిపారేసింది..

అలాటి స్థితిలో ఉన్న బావగారికి ఏదయినా సహాయం చేయాలని ప్రసాదు మనసు తహతహ లాడింది. తనను ఎంతో ప్రేమగా చూసి పెంచా రాయన! ఒక బావమరిదిగా చూడలేదు. పెద్ద కొడుకుగా చూసి పెంచి, పెద్దజేసారు! అలాటి ఆయనకు ఏదో చేయాలి! కాస్తయినా చేయూత నివ్వాలి!

ఏంచేయాలి ? ? ?

"బావా! అక్కను మనం ఎవ్వరం ఏమీ మార్చలేము! ఏనాటికో ఒకనాడు దేవుడే ఆమెని మార్చాలి! ఈ సమయంలో పిల్లల చదువులు పాడైపోతాయి! అందుకని మీకేమీ అభ్యంతరం లేకపోతే వాళ్ళను నాతో తీసుకువెళ్తాను."

రాఘవయ్యగారికి పిల్లలను అలా పంపటం ఇష్టంలేదు. దానికి మొదటి కారణం – 'మన బరువూ బాధ్యతలూ ఇంకొకళ్ళ నెత్తిన పెట్ట కూడదు!' అనేది! ఇహపోతే – 'ఈ నిరంకుశ పరిపాలనలో తానొక్కడే ఉండగలడా!' అనేది రెండో కారణం! కానీ – పిల్లల భవిష్యత్తు దృష్ట్యా ఆలోచిస్తే 'అది' చాలా మంచిదిగా భావించి అంగీకారాన్ని ప్రసాదుకు తెలియజేసారు!

రెండు రోజులు వాళ్ళను ఈ కాలేజి నుండి అక్కడి కాలేజికి మార్చటానికి చేయవలసిన పనులతో తీరిక లేకుండాపోయింది. తన పరపతిని ఉపయోగించి ఎలాగో పిల్లలను బందరు కాలేజీకి మార్పించ గలిగాడు.

మూడో రోజున మధ్యాహ్నంపూట ముగ్గురూ రాఘవయ్యగారి మంచం చుట్టూ కూర్చుని కబుర్లు









చెప్పుకుంటున్నారు. చాలా రోజుల తర్వాత రాఘవయ్యగారు మనసారా మాట్లాడింది ఆ రోజునే! ఉన్నట్టుండి మోహన్ అన్నాడు—"మామయ్యా! అసలు నాన్నకు అనారోగ్యం ఏముంది! ఎందుకు మంచంలోనుండి లేవలేకపోతున్నారు?"

ఆ ప్రశ్న వింటూనే రాఘవయ్యగారు బరువుగా నిట్టూర్పు విడిచి కళ్ళు మూసుకున్నారు.

'నిజమే' అన్నట్లు చూశాడు ప్రసాదు.

ఎన్నడూ లేనిది చనువుగా తండ్రి చేతిని తన చేతిలోకి తీసుకుని ఆప్యాయంగా నిమురుతూ ఉండి పోయాడు చంద్రం. అతని కళ్ళ నిండుగా నీరు నిల్చింది.

రాఘవయ్యగారికి హఠాత్తుగా ఒక విషయం గుర్తుకొచ్చింది. 'తనెందుకు బాధపడటం! తన దిగులు నిజంగా అర్థంలేనిది! తన బిడ్డలు రత్నాలు! కొండంత అండగా ఉన్న ఈ ఇద్దరు కొడుకుల్నీ చూసి ఆనందించాల్సింది పోయి, అందకుండా దూరంగా పోయినవాటి గురించి అనవసరంగా బాధ పడుతున్నాను! వాళ్ళు ఆడపిల్లలు కాదు—'ఎలాగా' అని దిగులు పడటానికి! మగపిల్లలు! ఎలాగయినా రాజాల్లాగా బ్రతుకుతారు!' అనుకుంటూ ఆలోచిస్తున్న రాఘవయ్యగారి పెదవులపై ప్రశాంతమైన చిరునవ్వు చిందులాడింది. తన చేతిని కొడుకు చేతులమధ్య నుండీ తీసి, అతని చేతుల్ని పట్టుకుని మృదువుగా నొక్కుతూ, ఆప్యాయంగా అన్నారు—"చంద్రూ! ఏడుస్తున్నావా! ఛ! ఆడపిల్లలా అదేమిట్రా! తప్పు నాన్నా! ఎంతో ధైర్యంగా ఉండాలి! మీరిద్దరూ బాగా చదువుకుని మంచి ఉద్యోగాలు చేయాలి!" సాధారణంగా రాఘవయ్యగారు పిల్లలతో ఎక్కువగా మాట్లాడరు. అసలు తారకు తప్ప మిగిలిన వాళ్ళకెవరికీ ఆయన దగ్గర చనువు లేదు. అలాంటిది తండ్రి అలా మాట్లాడుతూంటే చంద్రం బావురుమని ఏడ్చేశాడు.

కొంచెంసేపటికి ఆ ఉధృతం తగ్గాక అనునయంగా అన్నారు రాఘవయ్యగారు.

"అధైర్య పడబోకండి. నా ఆరోగ్యానికేమీ లేదు." అంతలోనే కళ్ళు మూసుకుని ఏదో ఆలోచనగా, చాలా నెమ్మదిగా అన్నారు. "బాబూ!

## తార

పెద్దక్కదే నాకు దిగులురా! తనకు ముందు జీవితంలో ఏ సహాయం కావలసివచ్చినా మీరే ఆదుకోవాలి! తార తల్లి ఏ విషయాన్నీ నోరు తెరచి చెప్పదు! అన్నీ గుండెలోనే దాచుకుంటుంది. పిచ్చితల్లి!" మూసుకున్న రాఘవయ్యగారి కండ్ల నుండీ నీళ్ళు ప్రక్కలకు జారిపోయాయి!

అది చూసి ప్రసాద్ కూడా చలించిపోయాడు. ఆ సాయంత్రం రాఘవయ్యగారు ఎంత వారిస్తున్నా వినకుండా బలవంతంగా డాక్టర్ని తీసుకొచ్చాడు ప్రసాదు.

ఏవేవో పరీక్షలు చేసి మందులు వాడమన్నాడు డాక్టరు. ఆ డాక్టరు ప్రసాదుకు బాగా తెలిసినవాడే! అందువల్ల రెండు మూడు రోజులకు ఓసారి వచ్చి చూస్తూండమని మరీ మరీ చెప్పాడు ప్రసాదు. అతనికి కొంత డబ్బిచ్చి "ఏమయినా మందులు మార్చాల్సివస్తే నీవే కొనుక్కొచ్చి బావకివ్వు." అని కూడా చెప్పాడు. "అపుడపుడూ ఎలా ఉన్నదీ నాకు ఉత్తరాలు వ్రాస్తూండు" అని చెబుతూంటే ప్రసాదు గొంతు కూడా బొంగురుపోయింది. అది గమనించిన డాక్టరు ప్రసాదు చెయ్యి నొక్కుతూ "డోంట్‌వర్రీ ప్రసాద్! ఆయన ప్రాణానికేం భయం లేదు! ఆయనకు కావలసిన ట్రీట్‌మెంటిచ్చే బాధ్యత నాది! కాకపోతే ఇక్కడే ఉండికూడా ఇంత ముదర బెట్టుకోవటం ఏం బాగాలేదు. పైగా చదువుకున్న వాళ్ళు! మీరుకూడా ఇలా చేస్తే ఎలా! సరే పోనీ— నేను ఆయన ఆరోగ్యం బాగుచేయటానికి నా శాయ శక్తులా ప్రయత్నిస్తాను. నువ్వేం దిగులుపడకు."

ఆ మరురోజే ప్రసాదు చంద్రాన్నీ, మోహన్నీ తీసుకుని బందరు వెళ్ళిపోయాడు. వెళ్ళేటపుడు 'అక్కను మరోసారి మందలించుదామా' అనుకున్న వాడే, మరలా—'చెవిటి వాడి ముందు శంఖాన్ని ఎన్నిసార్లు ఊదినా వ్యర్థమే!' అనుకుని విరమించుకున్నాడు.

* * *

రాఘవయ్యగారు ఇంకా కోలుకోక పూర్వమే 'తార' వచ్చింది. ఆ రోజు రాత్రి తొమ్మిది గంటలు అవుతూండగా పిల్లల్ని తీసుకుని వచ్చింది. వెంబడి వచ్చిన మనిషిని పంపేసి, పిల్లలకు పక్కలు ఏర్పాటు చేసి పడుకోబెట్టింది. నాగరత్నమ్మ కూడా పడుకున్నాక, మంచినీళ్ళు త్రాగి, తండ్రి వద్దకు వచ్చింది.

మంచంలో కాస్త ప్రక్కకు జరిగి "ఇలా కూర్చో తల్లీ" అన్నారు రాఘవయ్యగారు.

బాగా చిక్కిపోయి, పాలిపోయినట్లుగా ఉన్న తండ్రిని ఆవేదనగా చూసింది తార.

తార కళ్ళల్లో మెరుస్తున్న నీటిపొరను చూసి చిన్నగా నవ్వారాయన.

"ఏమిటి నాన్నా! ఇలా అయిపోయారేమిటి?" తార గొంతులో నిర్వచనానికందని బాధ తొంగి చూసింది.

ఆ రాత్రి తండ్రీ కూతుళ్ళు నిద్రపోలేదు. ఆయన గుడివాడ విషయాలు చెబుతూంటే వింటూన్న తార వెక్కి వెక్కి ఏడ్చేసింది. తన తండ్రిలాంటి మంచి మనిషిని అన్యాయం చేయటానికి వాళ్ళకు మనసెలా వచ్చిందని వాపోయింది!

నూజెల్ల విషయాలు వింటూన్న రాఘవయ్యగారు భయంతో కళ్ళు పెద్దవి చేసి మరీ చూశారు. వినటానికే ఒళ్ళు జలదరిస్తున్న ఆ సంఘటనలు తన కూతురి జీవితంలో జరిగినవే అని అనుకుంటూంటే ఆయన మనసు తల్లడిల్లిపోయింది.

ఒకళ్ళకొకళ్ళు ధైర్యం చెప్పుకున్నారు. కాస్త ఊరట కలిగినట్లయింది.

"ఇంక పడుకో తల్లీ! చాలా రాత్రయింది" అన్నారు.

తార పడుకున్నాక రాఘవయ్యగారు నిశ్శబ్దంగా రోదించారు. ఆయన మనసు పడుతూన్న బాధ వర్ణనాతీతం! ఎలాంటి పరిస్థితుల్లో వచ్చిందీ, ఏమిటీ అనే ఆలోచనా జ్ఞానంలేని నాగరత్నం తార పట్ల ఎలా ప్రవర్తిస్తుందో, ఏమిటో! ఎంతో సున్నితమయిన తార మనస్సు ఇప్పటికే దెబ్బతిని ఉంది! ఏ మాత్రపు ఆలోచనా శక్తి లేకుండా ప్రతి చిన్న విషయానికీ నోరు పారేసుకునే నాగరత్నం తారకు ఏమయినా సాంత్వన నిస్తుందా, లేక ఆమెను ఇంకా సాధించి దెబ్బ తీస్తుందా! ప్చ్! ఆర్థికంగా కూడా చితికిపోయి ఉన్న ఈ పరిస్థితుల్లో తార తల్లికి ఏమయినా న్యాయం చేయగలమా!'

రాఘవయ్యగారి ఆలోచనలు అలాగసాగుతుంటే,

# అమ్మా, బాబుకి తగిలిన గాయంలో ఏకాస్త మట్టి చొరబడినా దాన్లో సూక్ష్మజీవులు చేరచ్చు



## సూక్ష్మజీవులు చేరకుండా రక్షించండి

**BAND-AID**
**BRAND**

## పట్టీలతో

తెలివిగల తల్లులు, రేగిన గాయాలలోకి సూక్ష్మజీవులు చేరకుండా బ్యాండ్-ఎయిడ్‌తో రక్షిస్తారు. ప్రతి బ్యాండ్-ఎయిడ్ పట్టీలో:

- మరింత సౌకర్యంతో, త్వరగా గాయాన్ని మాన్పడం కోసం, అతుక్కోని కొత్త పట్టీ ఉంది.
- పగిలిన చర్మాన్ని సరిచేయడంకోసం, ఋజువైన క్రిమి నిరోధక పదార్థం ఉంది.
- గాయం త్వరగా మానడానికి లోపలికి గాలిని చొరనిచ్చే సూక్ష్మ రంధ్రాలున్నాయి.

బ్యాండ్-ఎయిడ్ బ్రాండ్ ప్యాక్‌ను ఎప్పుడూ దగ్గర ఉంచుకోండి.




ఇది 25 మరియు 50 స్ట్రిప్స్ గల ప్యాక్‌లలో దొరుకుతుంది.

Johnson & Johnson*

* Band-Aid and Johnson & Johnson are trademarks of Johnson & Johnson U.S.A. © J&J '82.

OBM/7975 TL

తార ఆలోచనలు మరో విధంగా సాగుతున్నాయి. 'ప్చ్! అసలే వీళ్ళ పరిస్థితి అంతంత మాత్రంగా ఉంటే పులిమీద పుట్రలాగా తను కూడా వచ్చి కూర్చుంది!'

* * *

తారవచ్చి ఒక వారం అయింది రాఘవయ్య గారి ఆరోగ్యం ఏమి మెరుగుపడలేదు. తార ఎంతో జాగ్రత్తగా వేళకు మందులూ అవీ వాడేది!

ఇంట్లో ఒక భాగం అద్దెకిచ్చారు! అది కాకుండా నాగరత్నం దగ్గర రెండు గేదెలున్నాయి! ఇదివరకు ఒక గేదె పాలు అమ్మినా, రెండో గేదె పాలు ఇంట్లోకి వాడేది! కానీ, ఇపుడు రాఘవయ్య గారు మంచం ఎక్కినప్పట్నుంచి రెండు గేదెల పాలూ అమ్మేస్తున్నాది ఒక్క గ్లాసుడు పాలు మాత్రం ఇంట్లో ఉంచేది! ఏమయినా అంటే "మంచమెక్కి పడుకుంటే కడుపులోకి ఎట్లా వస్తుంది?" అని అడిగేసేది.

చిన్నర మనుష్యుల్లాగా ప్రవర్తించే నాగరత్నమ్మ తీరు — రాఘవయ్యగారికి నిజంగా చిత్రవధ! చచ్చిపోవాలనిపించేది! కానీ — తార పిల్లలతో వచ్చేసరికి కనీసం, వాళ్ళకో రక్షణగా ఉండటానికయినా బ్రతకాల్సి తప్పదు, ఆవిడ అనే మాటలు పడక తప్పదు!

తార వచ్చాక రెండు రోజులు కొంచెం పాలు అట్టే పెట్టి స్వప్నకూ, రేణుకకూ ఇచ్చింది. కాసిని తోడు పెట్టి మజ్జిగ కూడా చేసింది! కానీ, తార మొగుడు పెళ్ళాన్నీ, పిల్లల్నీ పుట్టింట్లో వదిలి దేశాలమీదికి వెళ్ళిపోయాడన్న సత్యం తెలుసుకున్నాక

తారా ర

ఆ మర్యాద కాస్తా 'హూష్ కాకి' అన్నట్లుగా ఎగిరిపోయింది ప్రతిదానికీ విసుక్కోవటం, పిల్లల్ని చీదరించుకున్నట్లుగా మాట్లాడటం, సాధించటం - పది రోజుల్లోనే చాలా మారిపోయింది!

ఒకనాడు రాఘవయ్యగారు మందలించారు. ఇంతెత్తున ఎగిరింది నాగరత్నం. అన్నమాట, అనని మాట అని లేకుండా పెద్ద నోటితో వీధి వీధంతా వినపడేట్లుగా రయాగీ చేసేసింది.

నిశ్శబ్దంగా కళ్ళు తుడుచుకుంది తార.

ఒక్కక్షణం 'ఇంట్లోంచి పంపేద్దామా' అనుకున్నారు, రాఘవయ్యగారు. కానీ, 'ఈ పసిపిల్లల్తో, ఈ వయస్సులో ఎక్కడ, ఎట్లా బ్రతుకుతుంది! తిట్టినా, పెట్టినా ఇక్కడ కనీసం రక్షణ అయినా ఉంటుంది' అనుకున్నారు. అందుకే తారను దగ్గరకు పిల్చి "అమ్మా, తారా! మీ అమ్మ ఇవ్వాళ మనకు

## షాక్ ఎబ్జార్బర్

ఇల అలలలా పడిలేచే జీవిత ఒడిదుడుకులకు
తట్టుకుని నిలువ నిలిచ్చేవే కలలు
భ్రమే అయిన జీవితంతో
భారాలను మోసే విలుకలిగించేవే కలలు

డాక్టర్ వాడపల్లి లక్ష్మణరావు

కొత్తకాదు దాని మాటలు నువ్వు పట్టించుకోకు! ఇన్నేళ్ళూ ఎలాగో భరించాం! ఇంక ముందు కూడా భరించక తప్పదు తల్లీ! ఆదేదో తెలిసి తక్కువగా వాగిందని నువ్వు నాతో చెప్పకుండా ఎక్కడకూ వెళ్ళకూడదు! ఎలాటి అఘాయిత్యమూ తలపెట్టకూడదు! కేవలం పిల్లల కోసం, నా కోసం నువ్వీ ఇంట్లోనే ఉండాలి!" అని కూతురి దగ్గర మాట కూడా తీసుకున్నారు.

తార కూడా అదే అనుకుంది 'ఇప్పుడు అత్తగారింటికి వెళ్ళినా ఇట్టింటికి చులకన చెయ్యటమవుతుంది! అసలే నా రోగ్యంతోనూ, అవమానంతోనూ బాధపడుతూన్న నాన్నను ఇంకా అవమానం పాలుచేసి మరింతగా బాధపెట్టిన దాన్ని అవుతాను! పోనీలే! ఎంత తిట్టినా-కన్నతల్లే కదా! తప్పదు! ఏం చేస్తాం!' అని తారకూడా అదే నిర్ణయానికొచ్చింది.

వెంకటరత్నం 'కొరియర్' ద్వారా డబ్బు పంపించాడు. రెండువందల రూపాయలు! 'ఇంత డబ్బా!' అనుకున్నది తార

కొంచెంసేపు వెంకటరత్నం కబుర్లు చెప్పించుకుని, అతనికి అన్నం పెట్టి మరీ పంపించింది అతను వెళ్ళిపోయాక డబ్బు తీసుకెళ్ళి తండ్రికి చూపిస్తూ, వెంకటరత్నం విషయాలు చెబుతూన్న తార ఉలిక్కిపడింది

నాగరత్నమ్మ ఏమో అనటం వినిపిస్తోందిగానీ, అది తనని అని గ్రహించలేదు తెలుసుకున్న వెంటనే చిన్నబుచ్చుకుంది!

# ఉచితం!

## మైసూర్ శ్యాండల్ సబ్బు




### 1.5 కె.జి పాయింట్ ప్లాస్టిక్ జాడితో




స్టాక్ ఉండేవరకు
ఈ ఇనాము లభించును
ఈ ఇనాము రహితకూడా
పాయింట్ దొరకును.

# పాయింట్

**డిటర్జెంట్ ఉతికే పౌడర్**

కర్నాటక సోప్స్ అండ్ డిటర్జెంట్స్ లిమిటెడ్, బెంగళూరు వారి నాణ్యమైన ఉత్పాదన.
మార్కెట్ చేయువారు : మైసూర్ సేల్స్ ఇంటర్నేషనల్ లిమిటెడ్, బెంగళూరు.

MCA-PDP-65 Tel

''ముగ్గురు ఇంటబడి మేస్తున్నది చాలక, వచ్చిన చుట్టపు పొరగాళ్ళకి కూడా వండి వార్చాను...''

'ఈవిడ కన్న తల్లేనా!' ఆశ్చర్యపోయింది తార.

వెంకట్ పంపిన డబ్బు తీసుకెళ్ళి తల్లి చేతిలో పెట్టింది. ''ఆయన పంపారమ్మా, నాకేమి అవసర ముంటుంది! ముగ్గురం తింటున్నాము కదా! ఖర్చులకు వాడుకో!'' అంటూన్న కూతుర్ని సంబరంగా చూసింది.

అప్పటివరకూ అంత నీచంగా తిట్టిన నాగరత్నంలో – ఆ మార్పు చూడగానే ఏవగింపు కలిగింది తారకు.

మళ్ళీ ఒక వారం రోజులు పిల్లలకు కాస్త మంచి ఆహారమే ఇచ్చింది. ఆ తర్వాత మళ్ళీ మామూలే!

రేణుక పాలు చాలక గుక్కపెట్టి ఏడ్చేసేది! తల్లి హృదయం కట్టలు తెంచుకుని బావురుమనేది! గుండెల్లో దాచుకునేది! కానీ... కానీ... ఆ పసి హృదయానికి తల్లి బాధను అర్థం చేసుకునే శక్తీ, ఆకలిని చంపుకునే యుక్తీ ఏం తెలుస్తుంది!

పాపం, చక్కెర నీళ్ళు పోసేది తార. కానీ, ఎంతసేపు?

ఏదో నాలుగు ముద్దలు అన్నం కలిపి పెడు తున్నాది కాబట్టి స్వప్నతో పేచీ ఉండేది కాదు. కానీ, రేణుదే సమస్య అయింది.

రెండో రోజున సిగ్గు విడిచి, ఆత్మను చంపుకుని, కన్నీటిని అదిమిపట్టి అడిగింది. ''అమ్మా రేణు ఏడుస్తోంది. కొంచెం పాలు...'' తార మాట పూర్తికానేలేదు, ఛొయ్యి ఛొయ్యిమంది నాగరత్నం. గిరుక్కున తిరిగి పెరట్లోకి వెళ్ళిపోయింది. వేపచెట్టుకేసి తల బాదుకుంటూ ఏడ్చింది తార.

'వెంకట్! నువ్వెంతో అపురూపంగా చూసుకునే నీ భార్యా, నీ పిల్లలూ ఎలా బ్రతుకు తున్నారో నీకెలా తెలుస్తుంది! నీకెలా తెలియ చెప్పను!'

లోపల్నుండీ వినిపిస్తూన్న రేణుక ఏడుపు తార గుండెల్ని చీల్చేస్తోంది.

తల్లి కన్నీటితో కడుపు నింపుకోగలిగే శక్తే ఉంటే -- రేణు అంత అదృష్టవంతురాలు ఈ లోకంలో మరొకరుండరు!

తారకు ఏం చేయాలో తోచటం లేదు. ఇంట్లోని పరిస్థితి తండ్రికి తెలుసు! కాని, ఆయన ఏమీ చేయలేరని తారకూ తెలుసు! డాక్టరు వచ్చి నపుడల్లా, ఆయన తెస్తూన్న మందులు చూసి నప్పుడల్లా రాఘవయ్యగారి మనసులో ఒకే ఒక్క మాట సుడులు తిరుగుతూంటుంది. అది–'ఈసారి మీరొచ్చేటపుడు నాకు మందులు తేవొకండి. ఆ డబ్బుతో ఒక పాలడబ్బా తీసుకురండి!' అని.

కాని, వాకిట్లో రెండు గేదెలు కనిపిస్తూంటే– 'పాల పౌడరు డబ్బా కావాలి' అని అడగటానికి సభ్యత అడ్డం వస్తున్నాది!

మధ్య తరగతి కుటుంబీకులకు నిజంగా ఇదొక శాపం! ఏది పోయినా, ఏది ఉన్నా 'పరువూ, పరువూ' అంటూ దాన్ని మాత్రం వదల్లేరు!

పసిబిడ్డ ఆకలికి ఆగలేక డొక్కలు ఎగిరి పడేట్లు, సొమ్మసిల్లేట్లుగా గుక్కలుపట్టి మరీ ఏడుస్తూంటే – పరువు అడ్డొచ్చేగా రాఘవయ్యగారు డాక్టర్ని అడగలేకపోయింది! ఆ పరువు అడ్డొచ్చేగా తార ప్రక్కింట్లో అడగలేకపోయింది! ఆ పరువు అడ్డురావటం మూలంగానే నాగరత్నమ్మను గట్టిగా మందలించకపోవటం కూడా!

ఈ ప్రజలు అంతే! ప్రాణాలు పోతున్నాకూడ పరువూ, ప్రతిష్ఠ అంటూ వాటికి మాత్రం ప్రాకులాట మానరు!

ఏడ్చే రేణుకను ఎట్లా ఊరడించాలో తెలియని తార 'ఏమయితే అదే అవుతుందిలే' అనే మొండి ధైర్యంతో అన్నం బాగా పిసికి, నీళ్ళులాగాచేసి, కాళ్ళమీద పడుకోబెట్టుకుని, నోట్లో పోయటం మొదలుపెట్టింది.

* * *

తారవచ్చి నెలనాటి పదిరోజులు జరిగి పోయాయి.

## ఎండమావి

కోటి రంగుల
ఆశల కుంచెలతో
ఊహల కేన్వాస్‌పై
దిద్దిన భవిష్యత్ చిత్రం
అయోమయం
... ... ...
సాగే జీవితానికి
అదే –
రమణీయ మార్గదర్శకం

- క్రా సోమేశ్వరశర్మ

ఆ రోజు ఫిబ్రవరి 26 వ తేదీ.

బయట పిండి ఆరబోసినట్లుగా, ప్రకృతి అంతా శ్వేతవస్త్రాలతో అలంకరించుకుని వాహ్యాళికి విచ్చేసినట్లుగా వెన్నెల తెల్లగా మెరిసిపోతున్నాది!

పగలంతా తాము చూసిన చిత్రవిచిత్రమయిన, అతి భయంకరమయిన మానవనైజాలను అపుడే వచ్చిన చంద్రునికి వివరించుతూన్నట్లుగా అతని చుట్టూ తారట్లాడుతున్నాయి నీలినీలి మబ్బులు!

'మేఘాలందిస్తూన్న సందేశం నిజమే సుమా' అన్నట్లుగా తలపంకిస్తున్నాది ప్రకృతి మాత!

'ఆ – అలాగా!' అన్నట్లుగా కళ్ళుపెద్దవి చేసుకుని మరీ చూస్తున్నాడో, ఏమో – వెన్నెల మరింతగా ప్రకాశవంతమయింది!

నాలుగురోజుల క్రితం వెంకట్ మళ్ళీ డబ్బు పంపించాడు. జాబుకూడా వ్రాసాడు. ఆత్రుతగా విప్పింది తార.

''ప్రియాతి ప్రియమైన తారా!

నేను క్షేమంగానే ఉన్నాను. నా కార్యక్రమాలు చురుకుగా, నాకు సంతృప్తినిచ్చే విధంగా సాగుతున్నాయి ... ''

'వెంకట్! దేశం కోసం భార్యకు దూర మయ్యారు! ప్రజలకోసం కన్నపిల్లలకు దూర మయ్యారు! ప్రజాక్షేమం, ప్రజాక్షేమంటూ మీవాళ్ళ క్షేమాన్ని చూడలేకపోతున్నారు! సర్వమానవ సౌభాగ్యానికి పాటు పడుతూన్న మీకు – మీవాళ్ళు ఎంత దౌర్భాగ్యులుగా బ్రతుకుతున్నారో ఎలా తెలుస్తుంది వెంకట్, ఎలా తెలుస్తుంది!'

''తారా! నీవూ, పిల్లలూ పూజ్యులయిన మామగారి అండలో క్షేమంగా ఉన్నారని తెలుసామ్మ. నిజంగా నీవు నాజెల్లలోనే ఉంటే – ఎంతగా దూరం చేసుకోవాలని ప్రయత్నించినా, నా ఆలోచనలు మీ చుట్టూనే తిరిగేవి! ఎలా ఉన్నారో, ఏమిటో అని దిగులుగా ఉండేది! కాని, ఇపుడు నాకెంతో నిశ్చింత! నాలో ఆవేశంగా పరుగులు పెడుతూన్న రక్తం చేస్తూన్న నినాదాల విజృంభణలో ఆశయ సిద్ధి కోసం - లక్ష్యంతో, దీక్షతో కంకణాబద్ధులమైన వాలాటి మరెందరో విప్లవకారులకు మాతన శక్తినీ, చైతన్యాన్నీ ఇచ్చేనీ, ప్రోత్సహించేదీ – మీ ధైర్యమే తారా! మామగారి లాటి సహృదయుల అండ, నీలాటి ప్రేమమూర్తుల చిరునవ్వు మాకు వేయి దివ్వెల వెలుగునిస్తాయి! ఆ వెలుగులో మా పయనం నిర్విఘ్నంగా, దిగ్విజయంగా సాగాలి తారా!...''

'వెంకట్! మీలాటి ఉన్నతమయిన వ్యక్తికి భార్యనయినందుకు గర్వించాలో, లేక కనీసం కన్నపిల్లల ఆకలికూడా తీర్చలేని దుస్థితిలో ఉన్నందుకు సిగ్గుతో తల వగులగొట్టుకోవాలో అర్థం కావటంలేదు వెంకట్, అర్థం కావటంలేదు!'

''తారా! నా గురించి ఎలాంటి బెంగలూ, భయాలూ పెట్టుకోవద్దు!...''

'ఎంత తేలిగ్గా చెప్పారు వెంకట్! ప్రతిక్షణం ఆందోళనే! మీరు ప్రజల మనిషని నాకు తెలుసు వెంకట్! కాని, మా ముగ్గురి జీవితాలూ మీతోనే ముడిపడి ఉన్నాయి! ఏం చేయను! ఎంత నిబ్బరంగా ఉండాలని అనుకున్నా ఉండలేకపోతున్నాను.'

''పిల్లలు జాగ్రత్త తారా! నీ శిక్షణలో వాళ్ళను చక్కని పౌరులుగా తీర్చిదిద్దుతావనే నమ్మకం నిండుగా ఉంది! కానీ, పిల్లలపట్ల తండ్రిగా నా బాధ్యత నేను నిర్వర్తించలేకపోతున్నందుకు నాకెంతో బాధగా ఉంటుంది! క్షమించు తారా! తండ్రిగా, భర్తగా... మీకు న్యాయం చేయలేక పోతున్నాను...''

'వెంకట్! వెంకట్ ... అంతవరకూ ఎలాగో చదివిన తార ఆపైన చదవలేకపోయింది. అప్పటి వరకూ నిగ్రహంగా ఉండగలిగిన ఆమె ఇంక ఆపుకోలేకపోయింది! ఎవరికీ తెలియకుండా పెరట్లో వేపచెట్టు క్రింద కూర్చుని వెక్కి వెక్కి ఏడ్చేసింది!

ఇది చాలా సహజమయిన విషయం! ఎవరివల్ల నైనా మనకు బాధ కలిగినపుడు ఆ వ్యక్తి ఉదాసీనంగా ఉంటే చాలా కోపం వస్తుంది! కానీ – ఆ వ్యక్తి తన తప్పు తెలుసుకుని, అసహాయతను ప్రదర్శిస్తే భరించలేని బాధతో సుళ్ళు తిరిగిపోతాము!

వెంకట్ ఒక్కసారి కన్పిస్తే అతని గుండెల్లో తలదూర్చి తనివితీరా ఏడవాలని ఉంది తారకు.

(ఇంకా వుంది)








RED & WHITE
KINGS



"రెడ్ అండ్ వైట్
తాగే మాలాంటి
వారి మాటే వేరు!"

హైదరాబాదు మరియు సికందరాబాదులో మాత్రమే లభ్యం.

చట్టబద్ధమైన హెచ్చరిక: సిగరెట్ తాగడం ఆరోగ్యానికి హానికరం.

STATUTORY WARNING: CIGARETTE SMOKING IS INJURIOUS TO HEALTH.

Rediffusion/GPI/1576TL

( గత సంచిక తరువాయి )




















గాంధారి ప్రశాంతి జెందిన తరువాత, పాండవులు ద్రౌపదీ సహితులై కుంతీదేవి దగ్గరకు వచ్చారు. ఆమె కొడుకులని కుమారులను చూచి ఆనందము మనుమల మరణానికి పరితపించింది ............


తరువాత శ్రీకృష్ణ సాత్యకీ సహితులై పాండవులు, ధృతరాష్ట్ర విదుర సంజయులు, గాంధారి కుంతి, వారి కోడండ్రు తదితర నారీజనంబులు యుద్ధభూమిని జూడ వచ్చారు. గాంధారి వ్రతభంగం కాని విధంగా వ్యాసుడిచ్చిన దివ్యదృష్టితో యుద్ధభూమిని జూడసాగినది....

[ఇంకా ఉంది]




**టి. యి. వి. ఎల్. — రాయిబోటి**

పాసవుతామనుకున్నవాళ్లు పాస్ కారు. పాస్ కాము అనుకున్నవాళ్లు పాసవుతారు. దీనితో తల్లిదండ్రులకు ముఖంచూపలేక ఆత్మహత్యలకి తలపడుతున్నారు. ఇదేం పట్టించుకోనకుండా ప్రభుత్వం సభలు, సన్మానాలు జరుపుకొంటోంది. ఏమనాలి?

తప్పంతా కంప్యూటరుది అనేస్తారు కాని అన్యాయమైన విద్యార్థులబాధ ఎవరూపట్టించుకోడం లేదు. నిజమే. కాని. నకొక్క అనుమానం? చిన్న చిన్న విషయాలకిగగ్గోలు పెట్టే విద్యార్థిలోకం —తమ జీవితాల్లో అతిముఖ్యమైన చదువు పరీక్షలు వాటివిషయంలో ఎందుకు పిల్లిగా ప్రవర్తిస్తారు —క్లాస్‌మొత్తము పేపర్లు మళ్లీ దిద్దించమని గోల చేయలేరా? అన్యాయం జరిగిన విద్యార్థికి చేయూతనివ్వలేరా?

**జి. ఎస్. ఆర్. — జెంషెడ్‌పూరు**

కాలం యొక్క కఠిన పరీక్షలకి లోనైన వారి సాంఘిక గౌరవం ఎగాన భి మానలు మరింత ఉన్నత స్థితికి వచ్చాయి. అయితే జీవితంలో భంగపడిన రమీజాబీ, బాగాపేట్‌లోని స్త్రీ, మధుర, మదోన్మత్తుల బారి పడిన ఎందరో అమాయకుల పాలిట చూపబడిన సాంఘిక గౌరవమా మన స్త్రీలకు మీరు కావలసేది?

ఏం వారు స్త్రీలు కాదా? సాంఘిక దురన్యాయానికి బలి అయిపోయిన వీరు నిజంగా మనుషులు. వీరిపట్ల మన దృక్పథమే — మన నాగరికతకు కొలబద్ద. అనాగరికంగా అసహ్యించుకొంటామో, నాగరికంగా చేయూతనిస్తామో అది మీ సంస్కారాన్నిబట్టి ఉంటుంది.

**వి. ఐ. ఆర్. డి. — శేరాఫ్ 99 ఏపిఓ**

స్త్రీయే లక్ష్మి, సరస్వతి, పార్వతి. స్త్రీయే సృష్టికి మూలం. స్త్రీ అన్నివిధాలా పురుషునికంటే అధికురాలు. కాని నేటి స్త్రీలు పురుషునితో పోటీపడి సమాన హక్కులు కావలని వాదించి తామే తమ గ్రేడును తగ్గించుకొంటున్నారు. కారణం?

కారణం ఏమీలేదు తమ్ముడూ —మీరంటున్న ఆధిక్యంకూడ పురుషుడు ఇచ్చినదేనని అన్నిట్లకి గ్రహించారు ఆడవాళ్లు. మీరు చాలా గొప్పవాళ్లు, అంచేత పడి ఉండండి అనడం భరించలేకుండా ఉన్నారు. అన్నీ ఉన్నాయనుకోవడం ఏమీ లేనిదానికి నిదర్శన. ఆడదానికన్నీ ఉన్నాయి — అనడం కూడ అంతే!

**పి. పి. హెచ్. ఎస్. — సామర్లకోట**

స్నేహం అనేది చాలా పవిత్రమయినది. నాకు ఎంతోమంది స్నేహితులున్నారు . . .

స్నేహితులు కొందరే ఉంటారు. తెలిసిన వాళ్లు చాలామంది ఉంటారు.

**కె. యి. కె. — మాధవరం**

ఏదీ శాశ్వతం కాదని తెలిసే ఎందుకీ తపన?

కనీసం వర్తమానం శాశ్వతంగా తోచి.

**సీరా — సామర్లకోట**

చిన్నతనంలో తండ్రికి, తర్వాత భర్తకి, తరువాత కొడుకులకి బానిస— ఇంకెప్పుడు స్త్రీకిస్వాతంత్ర్యం? స్త్రీ తన భావాలను, ఆశయాలను పురుషుల ఎదుట ధైర్యంగా చెప్పకల్గినప్పుడు అసలైన స్వతంత్రం కని మాకు స్వతంత్రం కావాలని బల్లగుద్ది అరిస్తే ఎవరిస్తారు?

నిజమే కనీసం బానిస బ్రతుకు బ్రతుకుతున్నాం అన్నఅవగాహనకేనా ఏర్పడేలా చేయడానికి బల్లగుద్ది అరిచినా, కాకిగోల పెట్టినా, భర్త కట్టినా, కొడుకులు కించపరిచినా, అది సహజం అనుకునే అజ్ఞానపు అంధకారం నుంచి మేలుకొల్పడానికే హడావిడి. ఎప్పుడేనా పులివేట చూశారా? తప్పించుకుపోకుండ అన్నిప్రక్కలనుంచి చుట్టుముట్టేస్తారు. గోలగా. అప్పుడు దాన్ని చంపడం ఎంత సులభమో అది ఎదురు తిరగిడం అంతే సులభం. స్త్రీజాతి వాడాపులి. పారిపోయి సంప్రదయము చీకటిలో తలదాచుకోవాలో, ఎదురు తిరిగి మనిషిలా బ్రతకాలో తేల్చుకుంటుంది. ఆ గోల సనాతనులది, స్త్రీని మనిషిగా గుర్తించని వారిది.

**బి. ఆర్. — రాయిగడ**

నేటి సాహిత్యం సైన్సుకి ఎంత తోడ్పడుతోంది?

తోడ్పడకపోతే పోయె— వక్రబావ్యం చెప్పకుండా ఉంటే అంతే చాలు అనిపిస్తోంది.

**ఎస్. ఎల్. ఎన్. — పార్వతీపురం**

నేటి విద్యావిధానం గురించి మీ అభిప్రాయం?

విద్యావిధానం బాగానే ఉంది, అమలులోనే అర్థం లేకుండా పోతోంది. ముందు సిలబసు సరిచేయాలి. తరువాత టెక్స్టు బుక్ కమిటీలు ప్రక్షాళనం చేయాలి. అన్నైన గైడ్ పుస్తకాలు నిషేధించాలి.

క్షుద్ర సాహిత్యంపై మీ అభిప్రాయం?

నేను చదవను. నేను వ్రాయను.

కొన్ని పత్రికలు ఉత్తమ ప్రశ్నలకు బహుమతులిస్తున్నాయి. మీరా పథకంతలపెట్టకూడదు?

అదో బెడద. ఏది ఉత్తమ ప్రశ్న అన్న మీమాంసలో పడిపోతాను.

రచనా వ్యాసంగం సంఘ సేవ అనిపించుకొంటుందా?

కాదు. సాంఘిక బాధ్యత కల వృత్తి.

**ఎస్. వి. — టెక్కలి**

నేనొక అమ్మాయితో చాలా సన్నిహితంగా మాట్లాడుతూ ఉంటాను. మా స్నేహాన్ని కొందరు విమర్శిస్తూ ఉంటారు.

అలా అనుమానం కలిగించేలా స్నేహం చేయడం దేనికి? మామూలుగా మాట్లాడకూడదా?

**అనారా — ఖర్గపూరు**

'అమె' రాకతో నా రక్తాన్నిమరిచి మత్తుతో తేలాడుతున్నాను. ఏమిటీ చిత్రం?

ఎవరబ్బా ఖర్గపూరులో అమె? కవిత్వం చెప్పే అనారాని అడగాలా? చిత్రం ఏముంది? వెర్రి వేయి విధాలు.

**బి. వి. కె. — బొంబాయి**

శ్రీ వీరేంద్రనాథ్ రచనలపై మీ అభిప్రాయం రచయిత్రిగా చెప్పండి?

సారీ, నేను వారి రచనలు చదవలేదు. ●



"ఎవరు నువ్వు ?"

దగ్గరకు వెళ్ళబోయిన రామారావు వైపుకు తిరిగాడు దొంగ.

అంతే...రామారావు ఆశ్చర్యపోయాడు.

దొంగ...ఆ దొంగ.

"మీరు...మీరు"

రామారావు ముఖంలో ఆనందపు ఛాయలు.

దొంగ దగ్గరకు వెళ్లి అతని చేతులు పట్టుకున్నాడు రామారావు.



# దొంగ

## కంచుమర్తి వెంకటేశ్వరరావు

రాత్రి ఒంటి గంటయినా నిద్ర రాక మంచంమీద అటూ యిటూ దొర్లు తున్నాడు రామారావు. ప్రతిసారి ప్రమోషను వచ్చిన రోజున ఆ రాత్రి సరిగ్గా నిద్రపట్టదు రామారావుకు. దానిక్కారణం ఆనందంతో పాటు గతం గుర్తుకు వచ్చి అతన్ని ఉక్కిరి బిక్కిరి చెయ్యడమే.

ఆ రోజు ఉదయం ఆఫీసరుగ ప్రమోషన్ వచ్చిందని తెలియగానే స్నేహితులు గ్రాండ్‌గా పార్టీ ఇచ్చారు.

ఈ రోజు తనీ స్థితిలో ఉండడానికి కారణం ఎవరు?

ఒకే ఒక వ్యక్తి.

ఆ వ్యక్తి చేసిన సహాయమును తను మరువగలడా...

ఆ వ్యక్తి ఆ రోజు సహాయము చెయ్యక పోతే తనే స్థితిలో ఉండేవాడు?

రామారావు హాయిగా ఆదమరచి నిద్ర పోతున్న భార్య శైలజ వైపు చూశాడు. తల వెంట్రుకలు తెలవి ముఖంపై పడి ఫేను గాలికి అల్లరిగ కదులుతుంటే ఒక కొత్త అందం చిందులాడుతోంది శైలజ ముఖంలో. తపనతో దగ్గరకు లాక్కున్నాడు రామారావు.

ఇంతలో బయట తలుపులు గట్టిగ తీసిన చప్పుడు. పక్క గదిలో పడుకున్న పిల్లలు శేఖర్, కమల పెట్టిన కేకలకు ఉలిక్కి పడ్డాడు.

ఒక ఉదుటున మంచం దిగి తలుపులుతీసి పిల్లల గదిలోకి వెళ్ళాడు. ఒక మూల పిల్లలిద్దరూ బిక్కుబిక్కు మంటూ నిలబడి ఉన్నారు.

'డాడీ... దొంగ'

అని అరవబోయి తొమ్మిదేళ్ల శేఖర్ నోరు మూసుకున్నాడు.

"ఏయ్...మిస్టర్. నీ దగ్గరున్న డబ్బు, నగలు మర్యాదగా ఇవ్వు. లేదా నీ పిల్లలు" అని దొంగ కత్తి పిల్లలకు గురి ఉంచాడు.

"మీ గురించి ఎంతగా ఎదురు చూస్తు న్నానో తెలుసా! ఏ రోజైనా కనపడతారనే ఆశతో ఉన్నాను. నన్ను మీరు మరచిపోయి ఉండొచ్చు కానీ నేను మిమ్మల్నెప్పుడూ మరువను. మీరు చేసిన మేలుకు కృతజ్ఞతగ మీ రూపాన్ని నా గుండెల్లో దాచుకున్నాను. నన్ను జాగ్రత్తగ చూడండి, గుర్తుపట్ట గలరు."

రామారావు మాటలకు వచ్చిన పని మరిచి కత్తి జేబులో పెట్టుకుని ఆలోచనల్లో పడ్డాడు దొంగ.

పిల్లలు డాడీని, దొంగను మార్చి మార్చి చూస్తున్నారు.

అలికిడికి లేచి బయటకు వచ్చిన శైలజ కెవ్వుమని అరవబోయి దొంగ చేతులు పట్టుకుని మాట్లాడుతున్న భర్తను చూసి ఆశ్చర్యంతో గుమ్మం దగ్గరే విలబడిపోయింది.

"శైలూ ... సాయంత్రం తెచ్చిన స్వీట్సును ప్లేటులో పెట్టి తీసుకురా. అ

అరగంటలో భోజనం ఏర్పాటు చెయ్యి."

భర్త మాటలేం అర్థం కాలేదు శైలజకు. ఫోను చేసి పోలీసులకు అప్పగించవలసినది పోయి అర్ధరాత్రిపూట దొంగకు భోజనం ఏర్పాటు చెయ్యమంటారేమిటి!?

"శైలూ.. కదలవేం"

రామారావు గట్టిగ మాట్లాడేసరికి విసుక్కుంటూ వెళ్ళి స్వీటు ప్లేటు తెచ్చి టేబిలు మీద ఉంచి వంటింట్లోకి వెళ్ళిపోయింది శైలజ.

"శేఖర్, కమలా ... రండమ్మా దగ్గరకు. ఈయనకు నమస్కారం పెట్టండి."

శేఖర్, కమల భయపడుతూనే దగ్గరకు వచ్చి నమస్కరించారు. దొంగకు గతం గుర్తుకువచ్చి చిరునవ్వుతో రామారావు భుజంతట్టి టేబిలు దగ్గరకొచ్చి స్వీటు తీసుకున్నాడు.

అతను స్వీటు తింటుంటే తృప్తిగ చూస్తున్న రామారావు కళ్ళముందు గతం మెదిలింది. పదేళ్ళ క్రితం...

* * *

మధ్యతరగతి కుటుంబంలో ఇద్దరు అన్నయ్యలకు, ఒక తమ్ముడు, చెల్లెలు కు మధ్యన పుట్టిన రామారావు బి. ఏ; పాసై ఉద్యోగాల వేటలో పడ్డాడు. అప్పటి నుంచి మొదలయ్యాయి తిప్పలు.

పేపరులో పడిన ప్రతి ఉద్యోగ ప్రకటనకు అప్లికేషను పెట్టడం, ఇంటర్వ్యూ కోసం ఎదురు చూడడం అలవాటయి పోయింది రామారావుకు ఖాళీగా కూర్చోవడం ఇష్టంలేక ప్రైవేటుగ ఎమ్. ఏ; కు కట్టి ఫ్రెండ్స్ దగ్గర నుంచి పుస్తకాలు తెచ్చుకుని చదివి ఎలాగో కష్టపడి ఎమ్. ఏ; డిగ్రీ సంపాదించాడు.

ఈసారైనా క్వాలిఫికేషనుకు తగ్గ మంచి ఉద్యోగం వస్తుందని ఆశ.

రెండు సంవత్సరాలు గడిచాయి.

ఇప్పుడే ఈ నిరుద్యోగ పరిస్థితి ఇలా ఉంటె మరో పదేళ్ళకు ఎంత తీవ్రరూపం దాలుస్తుందో...భయం వేసింది రామారావుకి.

ఇంట్లో నాన్న విసుక్కోవడం ... అమ్మ సాధింపులు.

ఇద్దరన్నయ్యలూ పెళ్ళిళ్ళు చేసుకుని వేరు వేరు కాపురాలు పెట్టుకున్నారు. ఇంతకు ముందు దేనికైనా అప్లై చేయడానికి డబ్బు అడిగితే ఇద్దరిలో ఎవరో ఒకరు ఇచ్చేవారు. ఇప్పుడదీ లేదు.

నాన్న సరేసరి. ఇంకా రెండేళ్ళలో రిటైరవుతారు పిల్లలందరిని ఒక దారికి తీసుకు రావడంలో అతని కృషిలో ఏమాత్రం లోపం లేదు. ఇంకా ఇద్దరు చిన్నవాళ్ళున్నారు. తనేమని అడుగుతాడు?

ఇలా రోజులు భారంగా గడుస్తుంటె ఆ రోజు రామారావుని ఆనందంలో ముంచెత్తింది, ఇంటర్వ్యూకు రమ్మన్న కార్డు వచ్చి.

బస్సులో ఆ ఊరు వెళ్ళడానికి అమ్మను ఎలాగో బ్రతిమాలి పదిరూపాయలు తీసుకుని వెళ్ళాడు.

ఇంటర్వ్యూ బాగా చేసాడు.

ఉద్యోగం ఖాయమనుకున్నాడు.

అప్పుడు ఇంటర్వ్యూ ఆఫీసరు ఓ బాణం రామారావు కేసి గురిపెట్టి వదిలాడు.

"ఐదువేలివ్వగలవా ... ఇచ్చేలా ఉంటె రేపు సాయంత్రంలోగా మళ్ళీ కనబడు."

రామారావు గుండెకు గుచ్చుకుందా బాణం.

ఐదువేల రూపాయలు...ఎలా ఇవ్వగలడు?

# దొంగ

ఇంటికొచ్చి ఆ మాటే నాన్నకు చెప్పాడు.

"ఆ ఐదువేలుంటె మీ చెల్లెలకు పెళ్ళి చేసి నా బెంగ తీర్చుకునేవాడిని" అనేసి మరో మాటకు అవకాశం ఇవ్వకుండానే నాన్న తప్పుకున్నాడు.

ఇద్దరన్నయ్యలనీ అడిగాడు తెలిసిన వారందరినీ అడిగాడు అప్పుగా ఇవ్వమని. లాభం లేకపోయింది. పిచ్చెక్కినట్టు తిరిగాడు రామారావు.

రాత్రి తొమ్మిదయింది.

పార్కులో కూర్చున్న రామారావుకు దిగులు పట్టుకుంది

ఐదువేలిస్తే మంచి ఉద్యోగం

లంచం మొదటి మెట్టులో ఉన్న ఈ రోజుల్లో ఐదువేలు పెద్ద మొత్తమేమీకాదు. ఈ రేటు ఇలాగే పెరిగితే మరో కొన్ని సంవత్సరాలకు ఇరవై ఐదు వేలడిగినా ఆశ్చర్యపోనక్కరలేదు. కానీ ప్రస్తుతం ఐదువేలంటే మాటలా... అందులో మధ్యతరగతి వాడికి.

ఆలోచిస్తున్న రామారావుకు ప్రక్కన ఎవరో నిలబడి తననే గమనిస్తున్నట్టు కనిపెట్టాడు.

ఆ వ్యక్తి వయస్సు ఇంచుమించు ముప్ఫై సంవత్సరాలుంటాయి, కోరమీసాలు, చిందరవందరగ ఉన్న తల, బిగుతు బట్టలు, చేతిలో సిగిరెట్టు...

వీడెవడో పెద్ద రౌడీలా ఉన్నాడను కున్నాడు రామారావు.

"ఏం మిష్టర్ ... ఇంకా ఇల్లు గుర్తు రాలేదా."

"మరి తమరికో" విసుగ్గా అన్నాడు రామారావు తన సంగతి వీడి కెందుకన్నట్టు.

అతను గట్టిగా నవ్వాడు

"మాకా...మాకుంటూ వేళా పాళా లేదు. అందులోనూ రాత్రికి వారసులం, చీకటి మితులం. ఆఫ్ కోర్సు ... ఇల్లుందిలే. వెళ్ళాలన్న రూలు లేదు వెళ్ళకపోయినా అడిగేవారు లేరు."

ఉలిక్కిపడ్డాడు రామారావు.

అమ్మో...దొంగ.

చిన్నగా భయమేసినా, 'ఆఁ వీడేం చేస్తాడులే తంతే దమ్మిడి దొరకదు.'

రామారావుకి ధైర్యం వచ్చింది.

"ఏం బ్రదరూ ... ఏంటలా దిగాలుగా ఉన్నావు. వాలకం చూస్తుంటే నిరుద్యోగిలా కనిపిస్తున్నావే."

వీడు సైకాలజీ చదవలేదు కదా! అనుకున్న రామారావు దొంగో, దారో ఉన్నాళ్ళకు తన గోడు వినడానికి ఒక మనిషి దొరికాడనుకుని తన ఇంటర్వ్యూ సంగతంతా చెప్పాడు.

"అందుకే బ్రదరూ! డిగ్రీలు చదివి అచ్చోసిన ఆంబోతుల్లా రోడ్లమీద పడేకన్నా మా పనే నయం. ఎంతోకొంత సంపాదిస్తాం. రాజాలా బ్రతుకుతాం. అఫ్‌కోర్స్ దొంగతనమే మరి మా కిదే వృత్తి. అయినా మా కంటె మీ పెద్దమనుషులు దొంగలు కారా! ఇందాక నువ్వు చెప్పావే ఇంటర్వ్యూ ఆఫీసరు గురించి, వాళ్ళు దొంగలు కారా! వాళ్ళు కళ్ళ ముందే దర్జాగ అడుగుతారు. మేము వెనుక నుంచి తెలియకుండా తీసుకుంటాం. అదే మా ఇద్దరి తేడా. అందరూ దొంగలే."

దొంగ మాటలు రామారావుకి నవ్వాయి.

దొంగ మాటల్లో నిజం లేకపోలేదు.

"మీరు చెబుతున్నది, నిజమే. ఆ దొంగతనం నాకు చేతకాదే. అయినా మీతో వాదనెందుకు. రేపటి గురించి ఆలోచిస్తుంటే నాకు భయం వేస్తోంది. మంచి ఉద్యోగం చేతులారా పోగొట్టుకుంటున్నాను. ఇంకా మీతో మాట్లాడితే రేపటి నుంచి దొంగతనం చెయ్యమంటారేమో."

లేవబోయాడు రామారావు.

"చూడు బదరూ ... ఇప్పుడే ఇంటికెళ్ళి ఏం చేస్తావు. రేపు కదా డబ్బివ్వాలి. నాతో వస్తావా"

దొంగ అలా అనేసరికి క్షణకాలం ఆలోచించాడు.

"వీడు దొంగతనం చెయ్యడానికి తీసుకెళ్తాడు కదా! అదే ప్లానయితే గట్టిగ రెండు వాయించి పీడ వదిలించుకోవచ్చు, చూద్దాం ఎక్కడికి తీసుకెళతాడో...ఇదొక అనుభవం."

మనసులో అనుకున్న రామారావు దొంగ వెంట పడిచాడు.

చాలా దూరం వెళ్ళాక ఒక వీధిలోని చిన్న ఇంటిలోనికి తీసుకెళ్ళాడు దొంగ.

రామారావు ఇల్లంతా చూసాడు.

గదిలో చిన్న పెట్టె, ఒక కూజా, దండెం మీద బట్టలు తప్ప ఇంకేవీ లేవు.

దొంగ పెట్టెలోంచి ఒక మూట తీసి రామారావు కిచ్చాడు

మూట విప్పిన రామారావు కళ్ళు జిగేలు మన్నాయి.

రూపాయలు...ఐదులు.. పదులు...

"చూడు బ్రదరూ ... నీ కత్యంతరం లేకపోతే ఇందులోంచి ఐదువేల రూపాయలు తీసుకెళ్ళి ఉద్యోగం సంపాదించుకో. ఇంత సొమ్ము ఎక్కడిదని అడుగుతావా! ముందే చెప్పాను నేను దొంగనని. పెళ్ళాం పిల్లలు లేర్కు సంపాదించిన దాంట్లో కొంత దాస్తుంటాను. దొంగకు పొదుపేటనుకుంటున్నావా! మకాం మార్చిన తరువాత క్రొత్త పరిసరాలు అలవాటయ్యేవరకు దాచిన డబ్బు ఖర్చుపెడు తుంటాను. రెండు రోజుల క్రితం పెద్ద వ్యాపారస్తుడు దొరికాడులే."

రామారావుకు ఆశ్చర్యం వేసింది.

ఒక దొంగ తనకు సహాయం చెయ్యడమా!

దొంగల్లో ఇంత మంచి వారుంటారా?

నమ్మశక్యం కావడంలేదు రామారావుకి.

"ఏం బ్రదరూ ... దొంగ సొమ్మని ఆలోచిస్తున్నావా. ఈ డబ్బు ముట్టుకోవడమే మహా పాపమనుకుంటున్నావా! ఏదో మంచి వాడులాగున్నావు. సహాయం చేద్దామనిపించింది, ఇస్తున్నాను, ఆ పైన నీ యిష్టం"

రామారావు ఆలోచనల్లో పడ్డాడు.

ఈడబ్బుతీసుకెళితే తను రేపు ఉద్యోగస్తు డవుతాడు.

దొంగయినా మంచి మనసుతో ఇస్తానంటున్నాడు.

ఈ సమయంలో ఎవరు తనకు డబ్బిస్తారు?

తనెవరో తెలియకపోయినా సహాయం చేస్తున్న దొంగ మనసు గొప్పదనాన్ని అంచనా వెయ్యలేక పోతున్నాడు రామారావు.

రామారావు దొంగ చేతులను కళ్ళకద్దు కున్నాడు.

"మీరు నాకు బ్రతుకుతెరువు చూపిస్తు న్నారు, మీ మేలు ఈ జన్మలో మరువలేను"

రామారావు మళ్ళీ మళ్ళీ దొంగకు కృతజ్ఞతలు చెప్పి డబ్బు తీసుకొని అక్కడి నుంచి బయటపడి, భయపడుతూనే చీకట్లో నడిచి ఇంటికి చేరుకున్నాడు.

ఇంట్లో ఎవరికి చెప్పలేని విషయం.

'రేపు నాకు ఉద్యోగం వస్తుంది.'

ఆనందంలో ఆకలి బాధ తెలియడంలేదు. నిద్ర రావడంలేదు.

అలాగే రాత్రంతా గడిపి తెల్లవారగానే ముఖం కడిగి షేవింగ్ చేసుకుని నీటుగ తయారవుతున్న రామారావు కేసి అందరూ వింతగా చూస్తున్నారు. సంతోషంతో వెలిగి పోతున్న రామారావు ముఖం అందరినీ ఆశ్చర్య పరచింది

పరుగెడుతున్న బస్సుతో అతని ఉత్సాహం పరుగెత్తసాగింది.

ఆఫీసుకు చేరుకున్నాడు.

డబ్బు ఆఫీసరు చేతిలో పడింది.

అపాయింట్ మెంట్ ఆర్డరు రామారావు చేతికి వచ్చింది.

## అప్పుకవీయం

కోతపడ్డ జీతంలో
ఖుషీ నీకేం తెలుసు—
అప్పు చేసుకుందుకదో
అవకాశపు గొలుసు.

— వి. వి. మంగపతిరావ్

ఎగిరి గంతేసినంత పని చేసాడు.

రామారావుకి ఉద్యోగం వచ్చింది.

ఇలా ప్రారంభమయింది ఉద్యోగ జీవితం.

దొంగకు మళ్ళీ మనస్ఫూర్తిగా కృతజ్ఞతలు చెప్పడానికి వెళ్ళాడు.

దొంగ కనబడలేదు అక్కడి వారిని అడిగాడు దొంగ గురించి.

"దొంగలకు ఒక ఊరూ, వాడా స్థిరంగా ఉంటాయండీ?"

ఒకతను అలా చెప్పగానే ఊసూరుమన్నాడు రామారావు.

ఉద్యోగం వచ్చిన రెండు నెలలకు శైలజతో పెళ్ళి...తరువాత పిల్లలు...క్వాలిఫి కేషనుకు ప్రతిఫలంగా వెంట వెంటనే ప్రమోషనులు రావడం...ఇలా ఎన్నోమార్పులు రామారావు జీవితంలో జరిగాయి.

* * *

ఆ దొంగే... ఈ దొంగ!

భోజనం చేసిన తరువాత వెళ్ళడానికి సిద్ధమయ్యాడు దొంగ.

రామారావు మరోసారి దొంగకు నమస్క రించాడు.

"మీరు ఎప్పుడు కనిపిస్తారని ఎదురు చూస్తున్నాను. ఇన్నాళ్ళకు ఈరోజున మీకు మనస్ఫూర్తిగ కృతజ్ఞతలు చెప్పడానికి అవకాశమిచ్చారు. ఏదో ఒకరోజున మీరు వస్తారని, నా ఆతిథ్యం స్వీకరిస్తారనే నా కోరిక ఇన్నాళ్ళకు నెరవేరింది. మీ ఋణం ఎలా తీర్చుకోవాలో తెలియడంలేదు. ఈరోజు నేనీస్థితిలో ఉండడానికి కారణం మీరే. సంఘంలో పలుకుబడి, నేను నా భార్యా పిల్లలతో ఆనందంగా జీవితం గడుపు తున్నానంటె మీ దయ వలనే.

ఇంటిలో నా దంటూ ఏదీ లేదు. అన్నీ మీవే. మీరే ఉద్దేశంతో వచ్చారో ఆ పనిని పూర్తిచేసుకుని వెళ్ళండి. బీరువాలో నగలు డబ్బు ఉన్నాయి. అవన్నీ తీసుకెళ్ళండి. నే నేమాత్రం అభ్యంతరం చెప్పను.

మీ దయ వలన తిండికి, బట్టకు లోటు లేదు. వస్తువులంటారా! ఎలాగో మళ్ళీ సమకూర్చుకుంటాను."

రామారావు మాటలకు దొంగ కళ్ళు చెమ్మగిల్లాయి.

దొంగ రామారావు చేతులు పట్టుకున్నాడు.

"ఆ రోజు నేను చేసిన సహాయమును మరువకుండా నన్ను ఇన్నాళ్ళు గుర్తుంచు కున్నందుకు నాకు చాలా ఆనందంగా ఉంది. దొంగగా సమాజంచేత ముద్రింపబడి చీకటిలో బ్రతుకుతూ ఈ ప్రపంచంలో ఏ ఒక్కరి నుండైనా ఆత్మీయత, ఆదరణ, అభిమానం పొందగలనా అని అనుకునేవాడిని. అనుకోవడం కూడా పొరపాటనిపించేదప్పుడప్పుడు. ఎందు కంటే... నేను దొంగను కాబట్టే. దొంగకు విలువనిచ్చే ఔదార్యం మన సమాజానికెక్క డుంది? దొంగ దొంగే! దొంగ మంచిమనిషిగా మారడానికి ప్రయత్నించినా మన సమాజం అంత తేలిగ్గా అతన్ని మనిషిగ గుర్తించదు. అందుకనే దొంగ దొంగగానే బ్రతుకుగడపాలి.

మీరు చూపించిన అభిమానం, ప్రేమతో ఇచ్చిన ఆతిథ్యం వలన నన్ను మనిషిగా గుర్తించే మంచి మనిషి ఒకరున్నారని తెలుసుకున్న ఈ రోజు నా జీవితంలో చాలా విలువైనది. ఈ జన్మకు ఈ తృప్తి చాలు."

అని దొంగ వడివడిగ అడుగులేసుకుంటూ బయటకు వచ్చి, చీకట్లో కలిసిపోయాడు ●

## కార్టూన్‌లు పంపేవారికి మనవి

కార్టూన్‌లతోపాటు స్వంత చిరునామాగల స్టాంపులు అతికించిన కవరుపెట్టి సంపాదకుడు, ఆంధ్ర సచిత్రవారపత్రిక, గాంధీనగరం, విజయవాడ–3. అన్న చిరునామాకి టపాలో పంపాలి. వీటి పరిశీలనకు కనీసం 6 నుంచి 8 వారాలు పట్టవచ్చును. ఈలోగా, నేరుగా కాని, టపాలోగాని వీటిపై ఉత్తరప్రత్యుత్తరాలకు తావు ఉండదు. కార్టూన్‌లు 'టపా' లో పోయినా, దారితప్పిపోయినా సంపాదకునిబాధ్యత వుండదు. ప్రత్యేక సంచికలకు కార్టూన్‌లు పంపేవారు కవరుమీద ఆ సంచిక పేరు ఉదహరించాలి. ఈకార్టూన్‌లకి కూడా పై నిబంధనలు వర్తిస్తాయి.

—సం.

# వారఫలం

**26-3-1982 శుక్రవారం మొదలు 1-4-1982 గురువారం వరకు**

★మేషం : పలు మార్గాల నాల్గు రూకలు చేరగల వారం. దేవాదాయ ధర్మాదాయ విషయాలలో మీకు పరిచయం ఏర్పడగలవారం నూతనంగా అనేక విషయాలు వ్యాపార మార్గాన తెలిసి కొనుటకు అవకాశం ఏర్పడగలదు. స్త్రీలకు : ఆదాయమవుంటుంది. ఉద్యోగంలోని వారికి అనుకూలం, రాజకీయంగా మేలు గలవారం.

★వృషభం : 'జరుగదేమో' అనుకొన్న వ్యవహారం శుభపర్యవసానమునకు రాగలదు. నూతనవ్యక్తులతో పరిచయం ఏర్పడటం, తద్వారా అంతో యింతో మేలు చేకూరుటకు అవకాశమున్నది. వ్యాపారం చేసేవారైతే, అధికారులను బహు జాగ్రత్తగా కనిపెట్టి వుండాలి. స్త్రీలకు : నగలు నాణ్యాలు సేకరించుటకు ఉత్తమదినం.

★మిథునం : వస్తు వాహనాలు సంపాదించుటకు గాని, నగలు కొనుగోలు చేయుటకుగాని, నూతన విషయాలు లాభదాయకమైనవి గ్రహించుటకు గాని] అప్రయత్నంగా ధనం సేకరించుటకు గాని యిది ఉత్తమవారమే. స్త్రీలకు : అవివాహితులకు శుభం జరగటం, ఉద్యోగంలోనివారికి పెంపు చెప్పదగియున్నది.

★కర్కాటకం : మీ కొరకు శ్రమించి, మేలు చేయాలని, మీకు గల భూ, గృహ సంబంధమైన వివాదం పరిష్కరించాలని ఒకరిద్దరు మిత్రులు తాపత్రయ పడుతారు. సహాయం చేయనున్నారు. గ్రహించి సమయానికి లభించిన దానిని స్వీకరించండి. స్త్రీలకు : అన్ని రంగాల వారికి ధనలబ్ధి, అభివృద్ధి గలవారం.

★సింహం : ప్రతివారం ఒక్క మాదిరిగా జరుగుతుందని ఆశింపరాదు. కాలప్రవాహంలో పయనించెడు గాలు, కష్టసుఖాలు పడుగుపేకలవలె కనిపిస్తాయి. కష్టాలు కలకాలం ఉండవు. ఎందుకుచెప్పటమంటే ఏవో యిబ్బందులు రానున్నవి. బంధు విరోధం తటస్థపడగలదేమో, అభిప్రాయ భేదాలుండగలవు. అయినా ఆదాయానికి లోటురాదు. స్త్రీలకు : సుఖశాంతులకు లోటు, చికాకులుండే అవకాశం గలదు.

★కన్య : ధనలోపంలేదుగానీ, ఆరోగ్య లోపం, మానసికంగా ఏదో ఆందోళన, పనులు జరగక పోయెనే అనే తపనకు అవకాశం గలవారం. చాల రోజులుగ దాక నిలచిన ధనంగాని, చిరకాలమిత్ర సందర్శనంగాని లభించే మార్గమున్నది. వ్యాపారం యథాతథంగా జరిగిపోయే అవకాశంలేకపోలేదు. స్త్రీలకు: ఉద్యోగవృత్తులందు నూతనావకాశాలు, మిత్ర సహాయం, బంధుప్రీతికి అవకాశంగలవారం.

★తుల : బంధు విరోధం రానున్నది. అంతే గాక యిరుగు పొరుగు వారితో ఏలాగో కీచులాట రావటం కూడా సంభవం. మంచి చెడుగులను గుర్తించి మెలగాలి, అనేక రీతుల అవకాశాలు చిక్కుతాయిగాని లాభించేమార్గంలేదు. స్త్రీలకు: సుఖానుభూతిలోపించటం, యిబ్బందులుంటాయి.

★వృశ్చికం : ఆదరించేవారు, అభిమానించేవారు ధనాదాయానికి దోహదం చేసేవారు రచనా విధానంలో సదవకాశాలు అందించేవారుంటారు. అవకాశాలు పోగొట్టుకోకండి. వ్యాపారంలో లాభించే మార్గం ఉంటుంది. స్త్రీలకు : అనుకోని విధాన అప్రయత్న ధనాదాయం, ఆరోగ్యలోపం లేకపోవటం గమనార్హం.

★ధనుస్సు : నూతన ప్రయత్నాలు అమలునకు రాగలవు, సుఖశాంతులు ఏర్పడనున్నవి, ఏలాగో ధనలబ్ధి కూడ చేకూరగల దినాలే. వ్యాపారంలోగాని వ్యవహారంలోగాని ఏలాంటిచిక్కులు రావని గ్రహించాలి. స్త్రీలకు : కళా సాహిత్యరంగాలలో మీకు తగిన అవకాశాలుంటాయి.

★మకరం : ఆదాయం గల వారం. అవకాశాలు పలు విధాల లభ్యంకాగలవు వ్యాపారం యథాతథంగా జరిగిపోతుంది. అనుభవానికి రాగల వ్యవహారాలుంటాయి. క్రీడానిలో రాజకీయంగా చాల మందికి సదవకాశాలుండగలవు. స్త్రీలకు : ఉద్యోగ ప్రగతి, స్వల్పాదాయం చెప్పతగిన వారం.

★కుంభం : మీకు సహజంగా చేతనైనవృత్తిలో ఉద్యోగంలో పైమెట్టు నెక్కగల అవకాశాలు, యింత కాలము యిబ్బందుల చేత సతమతమైన మీకు చికాకులు తగ్గటం జరిగేఅవకాశాలుంటాయి. స్త్రీలకు : అనేక రీతుల అవకాశాలు ధనాదాయానికి దోహదం చేసేవి లభ్యమవుతాయి.

★మీనం : బంధువుల యింటి నుండి ఏదో శుభవర్తమానం రానున్నది. వయసువచ్చి, పెండ్లి జరుగలేదనుకొనే వారికి శుభ సమయం. అనుకోకుండ రాజకీయంగా కొందరకు మేలు జరగటం, క్రీడానిలో కొందరకు అంతర్జాతీయఖ్యాతి లభించటం విశేషం. ఆరోగ్య లోపం లేదని గ్రహించి మెలగండి.

— విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి

# షాక్ ట్రీట్‌మెంట్!

ఎమ్. చంద్రశేఖర్

"ఒరేయ్, రేపు సాయంత్రం ఆఫీసులో గంట పర్మిషన్ తీసుకుని త్వరగా ఇంటికి రా. అమ్మాయిని చూడ్డానికి వెళ్ళాలి"

అప్పుడే ఆఫీసు నుండి వచ్చి షర్టు విప్పి హేంగరుకి తగిలిస్తున్న సంపత్ - ఆమాటలు విని ఉలిక్కిపడ్డాడు.

ఇలా ఇంకా ఎన్ని గంటలు పెళ్ళి చూపుల కోసం ఆఫీసులో పర్మిషన్‌లు తీసుకోవాలి ? మొదట్లో "అమ్మాయిని చూడ్డానికి వెళుతున్నాం సార్, ఈ రోజు ఒక గంట పర్మిషన్ కావాలి" అని అడిగితే వెంటనే సంతోషంగా గ్రాంట్ చేసేవాడు మేనేజరు. ఆ తరువాత మాటిమాటికి మేనేజర్‌ని అలా అడగడం తనకే ఎబ్బెట్టుగా అనిపించి అడగడం మానుకొన్నాడు. మరీ అవసరమైనప్పుడు వేరే కారణాలు చెప్పసాగాడు. మళ్ళీ రేపు పర్మిషనా?

తండ్రి మాట విని విననట్లు వూరుకొన్నాడు సంపత్.

"ఏరా! నీకే చెప్పేది. వాళ్ళు మధ్యవర్తితో కబురు పంపించారు, రేపు అమ్మాయిని చూసుకోడానికి రావచ్చని. పైగా రేపు మంచి రోజు కూడా."

"ప్రయత్నిస్తాను పర్మిషన్ యిస్తారో లేదో?" చిన్నగా గొణిగాడు.

"పర్మిషన్ ఇవ్వకపోతే సగం రోజు శెలవు పెట్టేరా, వాళ్ళకి రేపు తప్పకుండా వస్తామని కబురు పంపించాను."

ఇక తప్పదనుకున్నాడు సంపత్. "అలాగే నాన్నా" ముభావంగా అన్నాడు.

* * *

ఆ అమ్మాయిని చూస్తూనే ఉలిక్కిపడ్డాడు సంపత్. "మీరా!" అన్న పదం అప్రయత్నంగా పెదాల చివరివరకు వచ్చి ఆగిపోయింది. ఆ అమ్మాయి కూడా దాదాపు అదే పరిస్థితిలో వుంది. అయినా ఏమీ ఎరగనట్లు నమస్కారం పెట్టింది.

ఆ అమ్మాయిని చూస్తూనే సంపత్ మనసు పరవళ్ళు తొక్కింది. ప్రతినమస్కారం చెయ్యాలన్న కనీస సభ్యత కూడ మరిచిపోయి అలాగే చూస్తుండిపోయాడు.

"మీ పేరు?" తెలిసి కూడ ఏదో ఫార్మాలిటీకోసం అడిగాడు.

"శోభారాణి" వీణ మీటినట్లున్న ఆ స్వరం సంపత్‌కి కొన్నాళ్ళ క్రితం వరకు చిరపరిచితమే.

"పేరుకి తగ్గ అందం" ఇప్పుడే కాదు, ఇంతకుముందు కూడ అనేకసార్లు అలానే మనసులో అనుకున్నాడు.

"ఏ ఆఫీసులో వర్క్ చేస్తున్నారండి ?"

"సెక్రటేరియట్‌లో నండి" క్రీగంట సంపత్ వైపు చూస్తూ అంది.

ఆ ఓరచూపు సూటిగా సంపత్ గుండెల్లో తగిలింది. ఆ ఓరచూపులో ఎన్నో అర్థాలున్నాయి.

అలంకరణ లేని ఆ అందానికి సంపత్ ఎప్పుడో అకర్షితుడయ్యాడు.

కళ్ళతోనే పక్కనున్న తండ్రికి సైగ చేసాడు, తనకి నచ్చిందన్నట్లుగా.

ఈ లోపల తల్లి పిలుపు నందుకుని శోభ లేచి లోపలికి వెళ్ళిపోయింది.

వరంధామయ్యగారు గ్రీన్ సిగ్నల్ అందుకున్న రైలు బండిలా ముందుకు కదిలాడు కట్న కానుకల విషయాలంటూ.

"అమ్మాయి ఉద్యోగం చేస్తోంది. నెలకి ఆరేడు వందల దాకా సంపాయిస్తోంది-మీరు అదే కట్నంగా బావించుకోవాలి. ఇక వేరే కట్నం మేం ఇచ్చుకోలేం పెళ్ళి ఖర్చులకింద అన్నిటికి కలిపి పదివేలిస్తాము. అమ్మాయి తను సంపాయించిన దాంట్లో నుండి పది కాసుల దాకా బంగారం కొని నగలు చేయించుకుంది. అది ఎలాగూ అమ్మాయికే చెందుతుంది. ఇంతకంటె ఎక్కువ మేమివ్వలేం"

# షాక్ ట్రీట్‌మెంట్!

అంటూ శోభ వాళ్ల తండ్రి ఖచ్చితంగా చెప్పేసాడు.

"మీరు అంత ఖచ్చితంగా మాట్లాడితే ఎలాగండి? మా వాడికి మంచి మంచి ఉద్యోగాలు చేస్తున్న అమ్మాయిల్నే, బంగారం కాకుండా, ఇరవై, ఇరవై అయిదు వేలిస్తామని ముందుకు వస్తున్నారు?" పరంధామయ్యగారు బేరం మొదలెట్టారు.

తండ్రి వ్యవహారం సంపత్‌కి నచ్చలేదు. "ఆశ". మనిషిలోని ఆశకు అంతం వుండదనుకుంటాను. ఆశ స్వార్థానికి దారి తీస్తుందంటారు, నిజమే కాబోలు. లేకపోతే తన తండ్రి ఎందుకలా మాట్లాడతాడు. బంగారం కాకుండా ఇరవై, ఇరవై అయిదు వేలిస్తామని ఎవ్వరూ రాలేదు. ఒకరిద్దరు వచ్చినా అమ్మాయికి ఉద్యోగం కాదు కదా హైస్కూల్ చదువైనా లేదు. తండ్రి మాత్రం అందరితో ఇలా గొప్పలు పలుకుతాడు. ఇక్కడే కాదు ఏ పెళ్లిచూపులకెళ్లినా ఇదే వరస. విని విని విసుగెత్తిపోయాడు తను.

తను నచ్చిన సంబంధాలు కట్నం తక్కువనే నెపంతో తండ్రి తిరస్కరించాడు. అయినా చూస్తూ వూరుకొన్నాడే తప్ప తండ్రి నెదిరించి "నేను అమ్మాయినే చేసుకుంటాను కట్నం తక్కువిచ్చినా ఫర్వాలేదు" అని నిర్మొహమాటంగా చెప్పలేక పోయాడు.

ఇలా ఎంత కాలం? రెండేళ్ల నుండి చూసిన సంబంధం తిరిగి చూడకుండా చూస్తున్నాడు. అయినా కుదరలేదు. ఈ లోపల ఆఫీసులో తనతో పాటు జాయిన్ అయిన వాళ్ళందరి పెళ్ళిళ్ళు అయిపోయాయి. బ్రహ్మచారిగా తనొక్కడే మిగిలిపోయాడు. బ్యాంకులో పని చేస్తున్నంత మాత్రాన లెంకి వేలు తీసుకోవాలని ఎక్కడా లేదే? ఇలాగే భీష్మించుక్కూర్చుంటే తనకీ జన్మలో పెళ్లవుతుందా?

తన వయసు తండ్రికి తెలియదా? తన జీవితకాలంలో దాదాపు సగభాగం పూర్తి కావస్తున్నా తన తండ్రికి బుద్ధి రాదేమిటి? తనబాధ పర్చం దేముకోడేమిటి?

ఆఫీసులో ఈ మధ్య అందరూ తనని చులకనగా చూస్తున్నారు. తనొస్తుంటే భీష్మాచార్యులు వస్తున్నారనో, బ్రహ్మచారి వస్తున్నాడనో కామెంట్ చెయ్యడం, అది తను

### బస్సులో 240 సీట్లు!

పెరుగుతున్న పట్టణాలలో ట్రాము కార్ల వలన సౌకర్యం కంటె ఇబ్బందులే ఎక్కువగా వుంటున్నాయి. ట్రాము కార్ల ప్రయాణం పట్టాలకే పరిమితం కావడంవలన వాటి నిర్వహణ కష్టంగానే వుంటున్నది. ఇప్పటికీ చాలా నగరాలలో ట్రాము కార్లను రద్దుచేసి బస్సులను ప్రవేశ పెట్టడం జరిగింది. అయితే బస్సులవలన పెట్రోలియం ఇబ్బందులు, వాతావరణ కాలుష్యం, బస్సులో 60 మందికంటే ఎక్కువ మంది సౌకర్యంగా ప్రయాణం చేయలేని విషయం మనకు తెలుసు. ఈ ఇబ్బందులను అధిగమించడానికి పశ్చిమజర్మనీలోని డీమ్లర్ బెంజ్ కంపెనీ వారు 240 మంది ప్రయాణం చేయగల బస్సులను తయారు చేశారు. వాతావరణం కాలుష్యం ఏర్పడకుండా వీటికి 250 కి. వా. ఎలక్ట్రిక్ మోటారులను అమర్చారు.

వినడం, విన్నా విననట్లు నటించడం అలవాటైపోయింది. ఏదైనా ఫంక్షన్ చేసుకున్నా తనని పిలవడం మానేశారు. అంతెందుకు ఆ సూర్యనారాయణ, తన కొలీగ్ మొన్నటివరకు అంత మిత్రుడనుకున్నవాడు, కొడుకుపుట్టాడని ఇంట్లో గ్రాండ్‌గా పార్టీ ఇచ్చాడు. ఆ పార్టీకి తనని పిలవలేదు. మరునాటి రోజు నిలదీసి అడిగితే "బ్రదర్, నీవు త్వరగా ఒక ఇంటి వాడివి కారా! అప్పుడు ఇటువంటి పార్టీలకి శ్రీమతితో కలిసి వద్దువుగాని, నిన్న నేనిచ్చిన పార్టీకి జంటల్ని మాత్రమే ఆహ్వానించాను. నీవు అక్కడికి వచ్చి అందరిలో లోన్లీనెస్ ఫీలవుతావని పిలవలేదు" అని నిష్కర్షగా చెప్పాడు.

తల కొట్టేసినట్లయింది వాడి మాటలు విని. అంటే తనకింకా పెళ్లి కాలేదని తన నందరూ బహిష్కరిస్తున్నారా?

"ఏది ఏమైనా ఈ సంబంధం మాత్రం వదులుకోకూడదు." మనసులో అనుకున్నాడు.

"ఏరా వెళదామా?" అన్న తండ్రి పిలుపుకి, ఆలోచనలకి స్వస్తిచెప్పి వెళదామన్నట్లుగా తలూపి కుర్చీలో నుండి లేచాడు సంపత్.

# షాక్ ట్రీట్ మెంట్!

"నాకీ సంబంధం నచ్చింది నాన్నా" ఇంటికి రాగానే తండ్రితో అన్నాడు.

"ఆ సంగతి అక్కడే చెప్పావుగా. అద్దీ సరేగాని వాళ్ళసలు కట్నమివ్వనన్నారు."

"పదివేలిస్తామన్నారుగా నాన్నా?"

"ఆ! ముష్టి పదివేలిస్తారట — అదీ ఖర్చుల కోసమట."

సంపత్ మాట్లాడలేదు.

అవును అంతకంటె ఎక్కువెందుకిస్తారు? అమ్మాయి డిగ్రీ పాసయింది. ఉద్యోగం చేస్తోంది, అందం వుంది. నెలకి ఆరేడు వందలందాకా సంపాయిస్తోంది. ఇక తనకంటె దేంట్లో తక్కువ? ఆమె సంపాదిస్తున్న జీతం జీవితాంతం, లెక్కిస్తే, ఎన్ని వేలవుతుంది? అలా ఆలోచిస్తే దాని ముందు ఈ కట్నమే పాటి? ఆ విషయమే తండ్రికి చెప్పబో యాడు సంపత్.

కాని పరంధామయ్య తాను పట్టిన కుందేలుకి మూడే కాళ్ళన్నాడు.

సంపత్‌లో తండ్రికి ఎదురు తిరిగే ధైర్యమున్నా ఇంటి పరిస్థితులు చూసి ఎదురు తిరగటంలేదు. పెళ్ళీడు కొచ్చిన చెల్లెలుంది— కాలేజిలోకి అడుగిడబోతున్న తమ్ముడున్నాడు. ఆ తరువాత పదోక్లాసు చదువుతున్న చిన్న చెల్లెలుంది. తండ్రి ఈ సంవత్సరాంతానికి రిటైరైపోతారు. అన్నీ ఆలోచించే తన స్వార్థం తను చూసుకోలేకపోతున్నాడు ఇంటి బాధ్యత సంపత్‌ను వెనక్కి లాగుతూ వుంది.

కొడుక్కి ముందు పెళ్ళి చేసి ఆ వచ్చిన కట్నంతో కూతురి పెళ్ళి చెయ్యాలని తండ్రి తపన. అంతేగాని తన కూతురి పెళ్ళి గురించి కూతురు లాంటి ఇంకొకమ్మాయిని కట్నం పేరుతో హింసిస్తున్నామని ఆలోచించటం లేదు. వాళ్ళకా ఆలోచనా జ్ఞానం వుండదా? వుంటుంది? వుంటే మరి ఎందుకిలా ప్రవర్తిస్తారు? స్వార్థం! తన కూతురి జీవితం బాగుపడాలి. నిజమే ప్రతీ తండ్రి కోరుకునేదే! మరి వచ్చే కోడలు కూడ ఒకింటి కూతురే అని ఆలోచించటం లేదెందుకని? అలా ఆలోచించినప్పుడే ఈ సఘం బాగుపడుతుంది. అలా ప్రతి ఒక్కరూ ఆలోచిస్తే అసలీ వరకట్న సమస్యే వుండదు.

తండ్రి బాధలు, సమస్యలు తనకి తెలును. పరిష్కారం చూపిద్దామన్నా తండ్రి తన

మాట వినిపించుకోడు. అందుకే తల్లిదగ్గర మొరపెట్టుకున్నాడు సంపత్.

"అమ్మా! ఆ అమ్మాయి నాకు నచ్చిందే. కట్నం తక్కువని నాన్నగారు ఈ సంబంధం కూడా వద్దంటున్నారు. నీవైనా నచ్చచెప్పవే. నాన్న బాధంతా చెల్లెలి పెళ్ళి గురించేకదా! చెలెలి పెళ్ళికి కావల్సిన డబ్బు నేను సమకూరుస్తాను. అంత నమ్మకంలేదా నామీద. నాకు నచ్చిన అమ్మాయితో నా పెళ్ళి జరిపించడానికి అభ్యంతరమేంటి?"

దీనంగా అడుగుతున్న కొడుకు వైపు జాలిగా చూసింది అనసూయమ్మ.

అనసూయమ్మకి కొడుకు చెప్పింది కూడ సబబుగానే తోచింది. వాడు మాత్రం ఏం కోరాడని? నచ్చిన అమ్మాయితో తన పెళ్ళి జరిపించమంటున్నాడు. అందులో తప్పేముంది? ఆ సంబంధం తనకీ వదులుకోడం ఇష్టం లేదు. అమ్మాయి చక్కని చుక్కలాగుంది. డిగ్రీపాసయింది. లక్షణంగా ఉద్యోగం చేసుకుంటోంది. తన కొడుక్కి ఈడూ జోడూ సరిపోతుంది. కట్నం తక్కువైనంత మాత్రాన మళ్ళీ యింత మంచి సంబంధం దొరుకుతుందా? వాడు తల్చుకుంటే అందర్నీ కాదని, ఆ అమ్మాయినే చేసుకుని వేరే కాపురం పెట్టగలడు. కాని తొందరపడి వాడలాంటి పని చెయ్యడని తనకి గట్టి నమ్మకం. తన నమ్మకాన్ని వాడింతవరకు ఏ విషయాల్లోను వమ్ము చేయలేదు.

ఆ రాత్రి ఒంటరిగా వున్నప్పుడు అనసూయమ్మ భర్తతో ఆ విషయాన్ని కదిపింది.

కాని పరంధామయ్య తను పట్టిన పట్టు విడవలేదు.

"వాడు ఇంటికి పెద్దవాడు. వాడి మాట కూడ వినడం మనకి మంచిది. మీ పట్టు కొంచెం సడలించుకోండి. అయినా వాడు మాత్రం కానిదేం అడగలేదుగా! ఆలోచించండి. మిగతా బరువు బాధ్యతలు ఆఖరికి రాధ పెళ్ళి కూడ వాడే చేస్తానంటున్నాడు. ఇక వాడి పెళ్ళి వాడు కోరుకున్న అమ్మాయితో జరిపించడానికి మీకేమిటి అభ్యంతరం??" వివ దీసింది భర్తని.

భార్య అంతగా నచ్చచెప్పినా వినకుండా పైగా "ఈ కుర్రకుంకలంతా పెళ్ళయ్యే వరకు ఇలాగే మాట్లాడతారు. తీరాపెళ్ళయిన తరువాత పెళ్ళాం కొంగుపట్టుకు తిరుగుతూ పూర్తిగా మారిపోతారు. వాళ్ళ కంటికి అప్పుడు అమ్మానాన్నా, అక్కాచెల్లి, అన్నాతమ్ముడు ఎవ్వరూ కనపడరు, అప్పుడు తెలుస్తుంది నీకు."

"తెలిస్తే తెలియనివ్వండి. కానివన్నీ ఇప్పుడే వూహించుకుని భయపడ్డం దేనికి? వాడి పెళ్ళయిన తరువాత మన రాతలో ఎలా వ్రాసి వుంటే అలాగే జరుగుతుంది. అంతేగాని జరగబోయే దాన్ని ముందుగానే వూహించుకొని, గోరంతలు కొండంతలుగా చేసుకుని అర్థం లేకుండా భయపడుతూ, వాణ్ని బాధపెడ్తూ, వాడు కోరుకున్న జీవితాన్ని మీరు కాదనడం మీకు భావ్యంకాదు." నచ్చచెప్ప బోయింది అనసూయమ్మ

అయినా పరంధామయ్య తన నిర్ణయాన్ని మార్చుకోలేదు. వాళ్ళు కనీసం ఇరవైవేలన్నా ఇవ్వందే వీలుకాదన్నాడు.

అనసూయమ్మ ఎంతగానో ప్రాధేయపడింది. అయినా ఫలితం లేకపోయింది.

* * *

మరుసటి రోజు సంపత్ ఆఫీసు కొచ్చాడన్నమాటేగాని మనసంతా క్రితంరోజు చూసిన పెళ్ళిచూపుల మీదే వుంది. శోభ తనని చూసి ఏమనుకుని వుంటుంది. తనని గుర్తుపట్టనట్లు ఎందుకు నటించింది? లేక నిజంగానే గుర్తుపట్టలేదా? అసంభవం? కాలేజి వదిలి ముచ్చటగా మూడేళ్ళు కాలేదు. అప్పుడే ఎలా మర్చిపోతుంది?

* * *

శోభ, తను ఒకటే కాలేజీలో ఒకే గ్రూప్ తీసుకున్నారు. అంత చనువు లేకపోయినా మూడేళ్ళు ఒకే కాలేజీలో చదివారు కాబట్టి ఒకరి అభిప్రాయాలు ఇంకొకరికి తెలుసు. ఇప్పటికీ తనకారోజు జరిగిన సంఘటన గుర్తుంది—

కాలేజి ఫంక్షన్‌లో "వరకట్న దురాచారాలని ఎలా రూపు మాపాలి" అన్న అంశం మీద డిబేట్ పోటీలు జరిగినప్పుడు, తన ప్రసంగానికి ప్రథమ బహుమతి వచ్చింది అప్పుడు కాలేజి బ్యూటీ అని పేరొందిన శోభ తన దగ్గరికి వచ్చి అభినందనలు తెలుపుతూ "మీ పెళ్ళికి మీరు కట్నం ఆశించరా?" అని అడిగినప్పుడు దానికి తను చెప్పిన సమాధానం విని "మీలాగే అందరూ వుంటే మా కష్టాలు ప్రాబ్లంసే వుండవు" అంటూ తన వైపు ఆరాధనగా చూస్తూ నవ్వినప్పుడు తనెంత పొంగిపోయాడు?

ఆ తరువాత ఎన్నోసార్లు శోభని ఒంటరిగా కలిసి 'ఐ లవ్ యూ' అని అనాలనుకున్నాడు. కాని సహజంగా ఆడవాళ్ళంటేనే బిడియపడే తన స్వభావం అంతపని చేయనివ్వలేదు. ఆ రోజుల్లో తన జీవితంలోకి శోభ ప్రవేశిస్తే తన జీవితం ధన్యమనుకున్నాడు. శోభలేనిదే తన బతుకు నిరర్థకమనుకున్నాడు.

కాలేజి జీవితంలో ఎన్నో అనుకుంటాము. అవన్నీ జరగాలని ఎక్కడా లేదు కాలేజీ జీవితమే మధురమైన ప్రపంచం యౌవనపు స్వప్నాలన్నీ అందులోనే ఇమిడి వుంటాయి.



కాలేజి అయిపోగానే అవికూడ కరిగి పోతాయి. అదే జరిగింది సంపత్ విషయంలో కూడ. కాలేజి అయిపోగానే అందరిలాగానే మామూలుగా ఉద్యోగపు వేటలో పడిపోయి అన్నిటిని మర్చిపోయాడు. కాని ఎప్పుడైనా గుర్తుకు వస్తే మాత్రం జీవితంలో మరపురానిమధుర మైన రోజులు అవేననిపిస్తాయి.

కాలేజి జీవితం గడిచిపోయాక తనకి తెలియకుండా తన మనసులోని శోభ అనే మమతకి తెరలు పడిపోయాయి. శోభని దాదాపు మర్చిపోయాడు. మళ్ళీ ఇప్పుడు హటాత్తుగా ... విచిత్రం... అప్పుడు శోభ తనదయితే తనెంతో అదృష్టవంతుడమకున్నాడు. మరి ఇప్పుడు ఆ అదృష్టమే కోరి వరిస్తుంటే కట్నం పేరుతో కాలదన్ను కుంటున్నాడు.

తన మాటలకి చేతలకి ఎంత తేడావుంది? ఉపన్యాసాలు ఇవ్వడం చాలా తేలిక కానివాటిని ఆచరణలో పెట్టడం ఎంత కష్టసాధ్యమో సంపత్‌కి అనుభవ పూర్వకంగా తెలిసివచ్చింది. అటు తండ్రి నెదిరించలేడు, ఇటు చూస్తూ శోభ నొదులుకోలేడు. అలాగని ఇంటి పరిస్థితులతో రాజీ పడనూ లేడు.

ఇప్పుడు తనొప్పుకున్నా శోభ ఒప్పుకుంటుందా? కట్నం తీసుకునే యువకులంటేనే మండిపడే శోభ తన సంగతి తెలిసీ ప్పూరుకుంటుందా? నీ కాలేజి ఉపన్యాసాలు ఏమై పోయాయని నిలదీసి అడిగితే తనేం సమాధాన మిస్తాడు? లేక శోభ కూడ తనలాగే

# షాక్ ట్రీట్‌మెంట్!

పరిస్థితులతో రాజీ పడడానికి ప్రయత్నిస్తున్నదా? అందుకే తనని చూసి గుర్తుపట్ట నట్టుగ నటించిందా?

విడతెగని ఆలోచనలతో బుర్ర వేడెక్కి పోయింది. తల తిరుగుతోందని చెప్పి ఆఫీసులో సగం రోజు సెలవు మంజూరు చేసుకుని సెక్రటేరియట్ వైపు కదిలాడు సంపత్

*  *  *

"నాన్నా, మేమిద్దరం "రిజిస్టర్డ్ మ్యారేజి" చేసుకున్నాం. మమ్మల్నాశీర్వదించండి" అంటూ ఇంట్లోకి అడుగు పెడుతున్న సంపత్‌ని, శోభని చూసి ఆ ఇంటిల్లిపాదీ ఆశ్చర్యంలో మునిగిపోయారు.

పరంధామయ్యగారు గుడ్లప్పగించి అలానే చూస్తుండిపోయారు ఆ జంట వైపు.

అనుకోని ఈ హటాత్పరిణామానికి అనసూయమ్మ అచేతనురాలయింది. కొడుకింత పని చేస్తాడని ఆమె కలలో కూడ వూహించ లేదు. తనకు నచ్చిన కోడలు వచ్చిందన్న సంతోషం ఒకవైపు, తన కొడుకు తన నమ్మకాన్ని వమ్ము చేసాడన్న బాధ ఇంకోవైపు అనసూయమ్మని మాట్లాడ నీయకుండా చేసాయి. కొడుకు వైపు, కోడలి వైపు అలానే చూస్తుండి పోయింది.

సంపత్ చెల్లెలు, తమ్ముడు ఒక మూల నిలబడి తండ్రి వైపు భయం భయంగా చూస్తున్నారు. ఇంట్లో కురుక్షేత్ర సంగ్రామం జరుగబోతోందని వాళ్ళకి తెలుసు. తుఫాన్ వచ్చేముందుండే ప్రశాంతత ఆవరించిందక్కడ.

ఎవ్వరూ ఏమీ మాట్లాడక పోయేసరికి తిరిగి సంపత్తే అన్నాడు—

"నాన్నా! మీకు డబ్బు కావాలి — నాకు భార్య కావాలి. మీకు గావల్సిన డబ్బు రానంత వరకు నాకు భార్య రాదని తెలుసు, అందుకే నా నిర్ణయం నేను తీసుకున్నాను. ఇక మీరు మమ్మల్నాశీర్వదిస్తారో, ఆగ్రహించి వెళ్ళి

## (అ)శక్తులు

తేలు కుట్టకపోయినా
చెప్పు తీసుకుంటాం
పాము కనిపించగానే
కర్ర పట్టుకుంటాం
కాని రోజుకో రంగు మార్చే
రాజకీయ ఊసరవెల్లిని
మాత్రమేమీ చేయలేక
పోతున్నాం! ప్చ్! ప్చ్!!

— అండా రామారావు

హిమ్మంటారో అంతా మీ నిర్ణయం మీద ఆధారపడి వుంటుంది.''

ఏనాడూ ఎదురు తిరగని కొడుకు అలా మాట్లాడేసరికి ఆశ్చర్యపోయారు.

అందరికీ క్షణాలు నిముషాల్లా భారంగా గడుస్తున్నాయి. అందరి మనసుల్లోను టెన్షన్. సస్పెన్స్ ఏం జరుగుతుందోనన్న ఆందోళన ? అంతా తండ్రి సమాధానంపై ఆధారపడి వుంటుంది. అందుకే అందరూ ఆతృతగా తండ్రి వైపు చూస్తున్నారు.

ఆ గదిలో సూది పడితే వినిపించేటంతటి నిశ్శబ్దం అలుముకొని వుంది.

ఆ నిశ్శబ్దాన్ని చీలుస్తూ పరంధామయ్య నోరు విప్పాడు—

"సంపత్! అయిందేదో అయింది; శుభమా అని పెళ్ళి చేసుకుని ఇంటికి వస్తే కాదని వెళ్ళగొట్టేంత సంస్కార హీనుడ్ని మాత్రం కాదు. నీవేం కానిపని చెయ్యలేదు — నీవు మెచ్చిన, నీకు నచ్చిన అమ్మాయిని చేసుకుని నీ నిర్ణయం నీవు తీసుకున్నావు దాన్ని కాదనే హక్కు నాకు లేదు. ఇన్నాళ్ళకి నీ వ్యక్తిత్వాన్ని నీవు నిలుపుకుని నా కళ్ళు తెరిపించావు. వెళ్ళమ్మా, వెళ్ళు లోపలికి'' అంటూ భార్యని కేకేసి కోడల్ని లోపలికి తీసుకెళ్ళమన్నాడు.

ఎంతో రసాభాస, ఎన్నో గొడవలు, పెద్ద సంగ్రామం జరుగుతుందనుకున్న ఇంటిల్లిపాదీ తండ్రి సమాధానంతో తల్లక్రిందులైపోయారు. నమ్మలేనట్లు తండ్రివైపు చూశారంతా. తుఫాన్ ఆగిపోయినట్లయింది. అనసూయమ్మ కూడ భర్త నిజంగా అంటున్నాడో లేక హేళన చేస్తున్నాడో అర్థంకాక అయోమయావస్థలో పడి నిల్చున్న చోటు నుంచి కదల్లేదు.

"ఏమే నీకే చెప్పేది. కోడల్ని లోపలికి తీసుకెళ్ళమంటుంటే గుడ్లప్పగించి నావైపు చూస్తూ అలా నిలబడితావేంటి?'' అని భర్త కసిరేటప్పటికి అనసూయమ్మ వెంటనే తేరుకొని కొత్త దంపతులకి ఇంట్లో అడుగు పెట్టబోయే ముందిచ్చే హారతి సిద్ధం చేయడానికి కొడుకు కోడల్ని అక్కడే వుండమని చెప్పి పూజ గదిలోకి వెళ్ళింది.

మండు వేసవిలో చల్లగా వర్షం కురిసినట్లయింది అక్కడున్న వాళ్ళందరికి. నిముషాల్లో వాతావరణం తేలికగా మారిపోయింది. హాస్యాలాడుతూ అందరూ కొత్త జంట చుట్టూ చేరారు.

* * *

"బజారుకెళ్ళి ఏమైనా పట్టుకొస్తాను'' అంటూ పరంధామయ్యగారు అంతకు ముందే బయటకు వెళ్ళిపోయారు. కొత్త జంట చుట్టూ చేరి కబుర్లాడసాగారు పిల్లలందరూ. అనసూయమ్మకూడ కోడలితో మాటలు కలుపుతూ కొంచెం నిష్ఠూరంగా అంది- "ఏమమ్మా! ఒక్కమాట ముందుగా చెప్పితే మేమే చేసే వాళ్ళంగా? ఎందుకంత తొందర పడ్డారు?''

ఆ మాటలకి సంపత్ శోభలు ఒకరి ముఖాలొకరు చూసుకొని చిన్నగా ముసిముసి నవ్వులు నవ్వుకోసాగారు.

వాళ్ళెందుకలా నవ్వుకుంటున్నారో తెలియక అనసూయమ్మ తెల్లబోయింది.

"అత్తయ్యా! ఇప్పటికీ మించిపోయింది లేదు. మీ యిష్టప్రకారమే కానివ్వండి. కాని ముందుగా మీరు మమ్మల్ని క్షమించాలి. ఎందుకంటే అసలు మేము పెళ్ళే చేసుకో లేదు. మా ఆఫీసు అయ్యాక ఇద్దరం కలిసి ఒకే ఆటోలో నేరుగా మీ ఇంటి ముందు దిగాం. మీతో ఓ చిన్న అబద్ధం ఆడాం అంతే'' తల వంచుకొని మెల్లిగా చెప్పింది శోభ.

"నిజంగానా ?'' అంటూ కొడుకు వైపు చూసింది అనసూయమ్మ.

"అవునమ్మా! నాన్నగారు నీవు చెప్పినా వినకుండా ఇరవై వేలకి తక్కువదిగననేటప్పటికి నాలో పట్టుదల పెరిగింది. నా పెళ్ళి శోభతో ఎలా జరగదో, అసలు జరిగిన తరువాత ఏం చేస్తారో చూద్దామని ఇద్దరం కలిసి ఓ చిన్న అబద్ధంతో ఈ నాటకం ఆడాం. శోభ నాతోపాటు కాలేజిలో చదువుకుంది. ఆ చనువుతోనే అన్ని విషయాలు శోభకి చెప్పి నాతో సహకరించమన్నాను నాన్నని మార్చడానికి-నాన్న మారితే సరేసరి లేకపోతే ఎలాగూ మేమిద్దరం పెళ్ళి చేసుకోవాలనుకున్నాం. అదృష్టవశాత్తు నాన్నగారే మమ్మల్నాదరించారు. మా కంతకంటే కావల్సిందేముంది ? ఇక మిగిలిందల్లా మే మాడిన ఈ నాటకాన్ని మెల్లిగా నాన్నకి చెప్పి నిజం చేయించే పూచి నాది'' అంటూ తల్లి దగ్గర గారాలు పోయాడు సంపత్.









అంతకు ముందే స్వీట్ ప్యాకెట్ చేతిలో పట్టుకుని గుమ్మంలోకి అడుగు పెడుతూ ఆగి వీళ్ళ మాటలన్నీ విన్న పరంధామయ్య గారు మనసులోనే చిన్నగా నవ్వుకున్నారు, తన కిద్దరూ కలిసి 'షాక్ ట్రీట్‌మెంట్' ఇచ్చారని.

# వంటలు



## బ్రెడ్ చాట్

కావల్సిన పదార్థములు: ఒక డబల్ బ్రెడ్, పెరుగు – కిలో, పెద్ద ఉల్లి పాయలు – 2, పచ్చిమిరపకాయలు – 6, కొత్తిమీర – కొద్దిగా, పొడి కారం – 1 స్పూన్, మిరియాల పొడి – 1 స్పూన్, నూనె – పావుకిలో, ఉప్పు – తగినంత

తయారుచేయు విధము: ఉల్లిపాయలు, పచ్చిమిరపకాయలు, కొత్తిమీర సన్నగా తరిగి పెరుగులో వేయవలెను. పెరుగుకు తగినంత ఉప్పువేసి ప్రక్కన ఉంచండి. నూనె కళాయిలో పోసి స్టౌపై వేడిచేయండి బ్రెడ్‌ను రెండు నిముషములు నీళ్ళలో నాననిచ్చి నీళ్ళు పిండి వేరే ప్లేటులో ఉంచి ఉప్పువేసి, మెత్తగా కలపవలెను దాన్ని చిన్న చిన్న వడలుగా చేసి నూనెలో ఎర్రగా వేయించవలెను. తీసినవి తీసి నట్లుగా పెరుగులో వేసి, అయిదు నిముషములు మూత పెట్టి వుంచండి. వీటిని ప్లేట్సులో సర్ది పైన మిరియాల పొడి, మిరప్పొడి చల్లి తినండి. తక్కువ వ్యవధిలో అతి చక్కటి సాయంత్రపు టిఫెను ఇది. వెరైటీగా ఉండి అందరు యిష్టపడతారు.

– వి. భారతి

## గోధుమ్ పాక్

కావలసిన పదార్థములు: గోధుమపొట్టు – ఒక కప్పు, పంచదార – రెండు కప్పులు, నెయ్యి – ఒక కప్పు.

తయారుచేయు విధానము: గోధుమపిండి బాగా జల్లించిన మీదట వచ్చిన 'పొట్టు''ను మూకుడలో కొద్దిగా వేయించి పెట్టుకోవలెను నెయ్యి లేక డాల్డాని కొదిగా వేడి చేయవలెను చెక్కెరలో నీరు చేర్చి ముదురు పాకం వచ్చే వరకు కలుపవలెను. ముదురు పాకం వచ్చిన వెంటనే గోధుమ పొట్టును, నెయ్యిలో కొంత భాగమును వేసి త్వరత్వరగా ఉండలు కట్టకుండా కలుపవలెను. పిదప మిగతా నెయ్యిని వేసి, గుల్లలా పొంగు వచ్చే వరకు కలిపి, నెయ్యి పూసిన పళ్ళెములోనికి వంపవలెను. వేడివేడిగా ఉన్నప్పుడే ముక్కలు ముక్కలుగా తుంచి షేప్‌లో కత్తితో కోసి, చల్లారిన పిదప డబ్బాలో వేసుకోవచ్చును.

ఇవి ఎక్కువ మోతాదులో కావాలన్న పై కొలతలకు రెండింతలు వేసి చేసికొనవచ్చును. అంతేకాక ఇవి ఎక్కువ రోజులు నిల్వ ఉంటాయి. మనము పారవేసే గోధుమ పొట్టుతో మంచి స్వీటు తయారవుతుంది.

ఇవి మైసూర్‌పాక్ కంటే రుచిగా ఉంటాయి. ఎంతో బలాన్ని ఇస్తాయి.

– డి పద్మావతి

## కాలిఫ్లవర్‌తో చపాతీలు

కావలసిన వస్తువులు: గోధుమపిండి – పావుకిలో, వంటనూనె – 50 గ్రా., కారం – అరచెంచా, టేబుల్ సాల్టు, కాలి ఫ్లవర్ –1, ధనియాల పొడుం – 1 చెంచా, పసుపు పొడి – పావుచెంచా.

తయారు చేయు విధానం: మొదట గోధుమ పిండిని, సరిపడా ఉప్పువేసి, తడిపి ముద్దలుగా చేసికొనవలయును. తరువాత 'కాలిఫ్లవర్' ను శుభ్రం చేసి పువ్వును తురుముకొని దానిని ఒక దళసరి గిన్నెలోనికి తీసికొని స్టౌమీద ఉంచి అందులో కారం, పసుపు, ధనియాల పొడుము, వాటికి సరిపడా సాల్ట్ వేసి ఒక గ్లాసు నీరు పోసి ఉడకపెట్టవలయును. బాగా ఉడికిన తరువాత దించివేసి ముందుగా తయారు చేసుకొన్న గోధుమ పిండి ముద్దలను తీసికొని వాటి మధ్య గుంటగా చేసి కూరను వుంచి ముద్ద అంచులు పల్చగా చేసి కూర కనిపించకుండా మరల ముద్దచేసి మామూలు చపాతి మాదిరి చేసి కొద్దిగా నూనె రాస్తూ కాల్చి తింటే మజాగా వుంటుంది.

ఇలాగే బంగాళాదుంప. ఆకు కూరలతో కూడ చేయవచ్చును. చాల రుచిగా ఉంటుంది.

– పద్మకృష్ణ

# హైదరాబాద్ నోట్‌బుక్

తిరుమల రామచంద్ర

## రాష్ట్రంలో నూతన మంత్రివర్గం !

ఎట్టకేలకు రాష్ట్ర నాయకుని ఎన్నిక సుఖాంతమైంది. కాశీమజిలీ కథలలోలాగ ఏనుగు చేతి పూలదండ శ్రీ భవనం వెంకటరాం కంఠసీమను అలంకరించింది. ఆయన ముఖ్యమంత్రిగా తెలంగాణా ప్రాంతంవారైన శ్రీ పి. జగన్నాథరావు ఉపముఖ్యమంత్రిగా ఫిబ్రవరి 28న రాజభవన్‌లో నూతన మంత్రివర్గం ప్రమాణస్వీకారం చేసింది. మంత్రి హోదా గలవారు శ్రీయుతులు ఎన్. జనార్దనరెడ్డి, కోన ప్రభాకరరావు, ఎ. అమరనాథరెడ్డి, ఎం. ఎ. అజీజ్, ఎం. బాగారెడ్డి, టి. బాలగౌడ్, పి. వి. చౌదరి, టి. హయగ్రీవచారి, కే. కేశవరావు, సి. మదనమోహన్, ఎం. మాణిక్యరావు, డాక్టర్ వై. ఎస్. రాజశేఖరరెడ్డి, చల్లా రామభూపాలరెడ్డి, బి. రామదేవ్, కనేరు రంగారావు, మజ్జి తులసీదాస్, అగిశం వీరప్ప, చనుమోలు వెంకటరావు, పాలడుగు వెంకటరావు, బి. వెంకటస్వామి, వి. వెంకటేశ్వరరావు, శ్రీమతి సరోజినీపుల్లారెడ్డి, సహాయ మంత్రులు శ్రీయుతులు ఆళ్వారుదాసు, ఎన్. చంద్రబాబునాయుడు, పి. గోవర్ధనరెడ్డి, గగినేని నాగేశ్వరరావు, ఐ. రామకృష్ణంరాజు, డి. రవీంద్రనాయక్, బి. సమ్మయ్య, వి. శేషశయనరెడ్డి, సి. హెచ్. శ్యామలరావు, పి. జనార్దనరెడ్డి, శ్రీ భవనం వెంకటరామ్‌ను ముఖ్యమంత్రి పదవి ఎలా వరించిందా?— అని రాష్ట్రంలో పలువురికి సంభ్రమాశ్చర్యాలు కలుగవచ్చు. కాని వ్యాపించిన పెక్కు వదంతులలో చలనచిత్రరంగంవారిలో వ్యాప్తిలో ఉన్న వదంతి కొంత ఆలోచనకు అవకాశమిస్తున్నది. సుప్రసిద్ధ చలనచిత్ర నటుడు శ్రీ ఎన్. టి. రామారావు తమిళనాడు చలనచిత్ర నట నిర్మాతలలాగ ప్రాంతీయ రాజకీయ పక్షాన్ని నెలకొల్పుతారని, వచ్చే మే నెలలో ఆయన షష్ట్యబ్దపూర్తినాడు రాజకీయ పక్షం అవతరిస్తుందని ఈ వదంతి. నేడు ప్రజా సామాన్యానికే గాక, మధ్య తరగతి వారికి కూడ చలనచిత్ర నటులపై ఆదరాభిమానాలు విశేషంగా ఉన్నాయి. అందులోను శ్రీ ఎన్.టి.రామారావు రాయలసీమ కరువు సమయాలలోను, కృష్ణా తుఫాను కష్టాలలోను తన బృందముతో తిరిగి వివిధ రూపాలతో సేవ చేయడం, ఇతర సంఘ సేవ కూడ నిర్వహించడం, పలు సంస్థలకు విరాళమివ్వడం, ప్రజలు మరువలేరు. అలా ప్రజారంజకుడైన నటశేఖరుడు తమ శ్రేయస్సు కోసం ఏదైనా రాజకీయ పక్షాన్ని నెలకొల్పితే, దానిని ప్రజలు ఆదరించడం తథ్యం. అలాటి దానిని మొగ్గలోనే తుంచి వేయాలని ఇందిరా కాంగ్రెస్ హైకమాండు నిశ్చయించి ఈ నిర్ణయం చేసిందని భారత రాజధానినుంచి వచ్చిన ఒక రాజకీయ పండితుడన్నాడు. శ్రీ వెంకటరామ్ శ్రీ ఎన్. టి. రామారావు సహాధ్యాయుడు. ఆ చనువుతో శ్రీ వెంకటరామ్ శ్రీ రామారావును ఎట్లో నచ్చజెప్పి, ఇందిరా కాంగ్రెస్ వాదినిగా మార్చవచ్చు. అలా మార్చకపోయినా నూతన రాజకీయ పక్షం, తలయెత్తకుండనైన చేయవచ్చు. ఆయన జ్ఞాతి సహాయ మంత్రిగా ఉన్నారు గనుక తద్వారా కూడ కొంత వత్తిడి చేయవచ్చు. పొరుగురాష్ట్రమైన తమిళనాడులో చలనచిత్ర నటుల ప్రాభవం కాంగ్రెసుకు కంచుకోటగా ఉన్న తమిళనాడులో దాని నామరూపాలు లేకుండ చేసిన బలాన్ని చూచిన ఢిల్లీ పెద్దలు ఈ రాజకీయ ఎత్తు వేశారని, చలనచిత్రరంగంవారి ఊహ. ఏమైనా, ఎన్నికల వేడి కలిగితే గాని కొత్త పార్టీల ప్రాదుర్భావం గురించి చెప్పలేము. ఉన్నత విద్య, ఉదాత్తశీల, శ్రీ వెంకటరాం పరిపాలన ప్రజారంజకంగాను, ప్రతిష్ఠాకరంగాను ఉండగలదనే భావిస్తున్నాను. శ్రీ వెంకటరామ్ 1931 జులై 16న గుంటూరుజిల్లా సత్తెనపల్లితాలూకా ముప్పాళ్ళ గ్రామంలో జన్మించారు. పదకొండవ ఏట క్విట్ ఇండియా ఉద్యమంలోను పిదప స్వాతంత్ర్యోద్యమంలోను పాల్గొన్నారు. యువజనోద్యమంలో పాల్గొని మూడు సార్లు అరెస్టయ్యారు. ప్రాంతీయ విద్యార్థి కాంగ్రెస్ స్థాపించారు. గుంటూరు ఏ. సి. కాలేజిలో పట్టభద్రులైన పిదప నాగపూర్ విశ్వవిద్యాలయంలో ఎం. ఎ. ఎల్. ఎల్. బి. పట్టం పుచ్చుకొని న్యాయవాదిగా గుంటూరుజిల్లాలో పేరుపొందారు. న్యాయశాస్త్రాధ్యాపకులుగాను కొంతకాలం పనిచేశారు. ఆయన సమైక్యవాది కనుక, రెండు వేర్పాటు ఉద్యమాలలోను ఇడుములుపడ్డారు. 1971లో చెలరేగిన ప్రత్యేకాంధ్రోద్యమంలో ఆయన ఇంటిని గ్రంథాలయాన్ని ప్రత్యేకవాదులు కాల్చివేశారు. డాక్టర్ చెన్నారెడ్డి మంత్రివర్గంలోను శ్రీ అంజయ్య మంత్రివర్గంలోను విద్యామంత్రిగా సమర్థతతో పనిచేశారు. పిదప రవాణా మంత్రిగా రోడ్డు రవాణా సంస్థ సిబ్బంది సమ్మెను నిపుణతతో పరిష్కరించారు. ఉపముఖ్యమంత్రి శ్రీ జగన్నాథరావు మెదక్‌జిల్లా నర్సాపూర్‌లో 1931 మే ఆరవ తేదీన జన్మించారు. ఉస్మానియా విశ్వవిద్యాలయం న్యాయశాస్త్ర పట్టభద్రులై రాష్ట్ర హైకోర్టులో న్యాయవాదిగా పనిచేశారు. 1960లో నర్సాపూర్ సమితిలధ్యక్షులుగా ఎన్నికై, 1967 లోను, 1973 లోను రాష్ట్ర విధానసభకు ఎన్నికయ్యారు. విధానసభ ఉపసభాపతిగా పనిచేశారు. 1974లో తెలంగాణా అభివృద్ధి సంఘం అధ్యక్షులుగా నియమితులై 1977లో దానిని పరిత్యజించారు. 1978 నుంచి ఇందిరా కాంగ్రెస్‌లో ముఖ్య పదవులను నిర్వహించారు. 1980లో విధానసభ నుంచి విధానపరిషత్తుకు ఎన్నికయ్యారు. శ్రీ జగన్నాథరావు మాజీమంత్రి డాక్టర్ లక్ష్మినర్సయ్య సన్నిహిత బంధువు.

**పూర్వకవుల స్మారకాల నిర్మాణం :**

వరంగల్లులోని పోతన నివాస గృహాన్ని స్వాధీనం చేసుకుని స్మారక మందిరంగా నిర్మించడానికి రాష్ట్ర ప్రభుత్వం నిర్ణయించింది, దీనికి ప్రభుత్వం ఐదు లక్షలు మంజూరు చేసింది. ఇలాగే సుప్రసిద్ధ ప్రాచీన కవి పండితుల స్మారకాలను ఆయా స్థలాలలో నిర్మించడానికి తలపెట్టిన ప్రణాళికతో మహావ్యాఖ్యాత కొలచెల మల్లినాథ సూరి స్మారకం మెదక్ జిల్లా నర్సాపూర్ తాలూకా కొలచెలమల్లో లక్ష రూపాయలతో ఆడిటోరియం నిర్మిస్తారు, పండితరాయ జగన్నాథుని మహా చిత్రాన్ని రచింపజేస్తారు. ప్రముఖ వాగ్గేయకారులైన త్యాగరాజస్వామి పూర్వుల స్వస్థలమైన ప్రకాశం జిల్లా కాకర్ల గ్రామంలోను, శ్యామశాస్త్రి పూర్వుల స్వస్థలమైన ప్రకాశం జిల్లా కంభంలోను స్మారక చిహ్నాలు నిర్మిస్తారు. ఇలాగే నేలకొండపల్లిలో భక్తరామదాసుకూ, రాజమహేంద్రవరంలో రాజరాజనరేంద్ర నన్నయ భట్టారకులకు, నెల్లూరులో తిక్కనకు, గుంటూరులో శ్రీనాథునికి, విజయనగరంలో ఆనంద గజపతికి, శ్రీకాకుళంలో పూర్ణయ్య పంతులకు, ఖమ్మంలో సర్దార్ జమలాపురం కేశవరావుకు, స్మారక చిహ్నాలు నిర్మిస్తారు. విశాఖపట్నంలో పోలీసు శాఖ నిర్మిస్తున్న ఆడిటోరియంకు శ్రీ తెన్నేటి విశ్వనాథం పేరు పెడతారు. విజయనగరంలో వున్న గురజాడ అప్పారావు, ఆదిభట్ల నారాయణదాసు గృహాలను, రాజమండ్రిలోని వీరేశలింగం గారి ఇంటిని ప్రభుత్వం స్వీకరించి స్మారక చిహ్నాలుగా రూపొందిస్తుంది. ఈ సంగతులను సాంస్కృతిక శాఖా మంత్రి శ్రీ భాట్టం శ్రీరామమూర్తి ఫిబ్రవరి 15 న పత్రికా విలేఖరులకు తెలియజేశారు.

**సోవియట్‌కు ఆంధ్ర బియ్యం :**

సోవియట్ వర్గ దేశాలకు బియ్యం, తవుడ ఆముదం, ఎగుమతి చేయడానికి ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర వాణిజ్య సంస్థను అనుమతించ ఆంధ్ర పార్లమెంటు సభ్యులు శ్రీయుతులు పార్థసారధి, కె. వోబుల్‌రెడ్డి, రాజగోపాలరావు, కె.వి. ఆర్. బాలసుబ్బారావు, కేంద్ర ప్రభుత్వాన్ని కోరారు. రాష్ట్రంలోని వేలు రకం బియ్యం గల్ఫ్ దేశాలకే గాక సోవియట్ వర్గ దేశాలకు ఎగుమతి చేసి లాభాలు పొందవచ్చని వారు సూచించారు.

**ఉవ శ్రుతి :**

"తానొకటి తలిస్తే దైవమొకటి తలుస్తుంది—" అనే పెద్దల వాక్యంపై ఇప్పటికైనా మీకు నమ్మకం కలిగిందా? అని ఒక పెద్దమనిషి నన్నడిగాడు. రాష్ట్ర రాజకీయ పరిణామాలను చర్చిస్తూ. దీంట్లో దైవం ప్రసక్తి ఏముంది? ... అంతా చేశారు అన్నాడు మా సంభాషణ వి... మి తుడొకడు.


Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press, Mallikarjuna Rao Street Gandhinagar, Vijayawada-3. Editor : S. Radhakrishna.